చం॥ నొసలసలంట జోతలిడి ♦ నోఁచిననోఁతలుఁ జక్కనౌటచేఁ
గిసరెడఁ ద్రోఁచి నీయమఁగు ♦ కెంజిగురాకుల నంటనిచ్చి నా
కసటుఁ దొలంగఁజేసి నయ ♦ కారితనానఁ జెలంగునట్టి నీ
యొసగనుఁగేతి నెన్నఁగల ♦ నేసిరియక్కఁనఁ జేప్పఁగాయఁదా. 84

గీ॥ అట్టిజేజేల దొరకుఁ దో ♦ డై నకృష్ణు
నెపలిరాలేక యొకకొన్ని యోఁడులుండి
నేఁటికిచ్చటి కరుదెంచి ♦ నిలచినాను
తల్లిలచ్చన యెద సంత ♦ సిల్లికంటె. 85

ఉ॥ రంగలరాయఁ జిల్కఁదన ♦ రందనకోర్కెలుఁ గ్రోళ్ళదాఁట నో
లింగను నేలయందు నల ♦ లిద్దగు జానులుఁ గల్గునట్టి శ్రీ
రంగని యూపుఁదొల్లియగు ♦ రడ్డులనుండియు నేగుఁదెంచుటన్
దొంగలితేటయూనుములఁ ♦ దొయ్యలిజానుగులంటనాఁడినన్. 86

కం॥ అనియూఁఖలఁ గూర్చినయటు
సన తేనియ తేటకన్న ♦ సలియానుడులన్
దనరఁగ నాడినజానుఁగు
లనుఁగుగ నాలించిచేడె ♦ నలరుచుననియన్. 87

మత్తకోకిల :

ఓలిసీగనుఁగొన్న నేలన ♦ నుండుఁజక్కఁదనాలు సో
ద్దేలనన్నిఁటి నాలకించితిఁ ♦ దేటగానుడుగంగ నే

లీలఁగృష్ణుని కాలుదోయిని ♦ లెస్సగా నిడఁజేసి నాఁ
జాలసంటిటు నేగుఁదెంచిన ♦ జాడఁదెల్యఁగఁజేయుసూ. 88

గీ॥ అతఁ డెట్టిఁడు సత్తెంత ♦ యతనితల్లి
యెందుఁ బెట్టెను లతని కె ♦ ల్లాండ్రు నేరు
లలిగొనాల్ తెట్టియతనికే ♦ లాగునుండు
నెట్టిఁగిఁగల యొడలుండుఁ ♦ జుట్టలేరు. 89

గీ॥ కడఁకనేతల్లి డొక్కనఁ ♦ గలిఁగినాఁడొ
కొంపు లెంపఁజుఁ దలలంటి ♦ కోసినాఁడొ
వెలఁగియేనాఁటి కర్జాలుఁ ♦ జేసినాఁడొ
యొషఁదగిర్చఁగ నాలింతు ♦ నుడుఁగుచిలుక. 90

కం॥ ఇన్నిఁటిలో నొకటడలే
కన్నిఁటి నాలించిచూచి ♦ నంతనుడుఁగు నా
కెన్నఁగ నరితెదఁగలుఁగుచు
నున్నదియో రాచచిలుక ♦ యుఱుతరలీలన్. 91

మ॥ ఆపఁగానంతటఁ జిల్కయిట్లనియె నేఁ ♦ డా జేజెరానేలు కొ
న్నన చిల్గుల దంటతండ్రికతల ♦ న్నాకేనయగ్గించఁదో
చినయంత న్దలియంగ జేయఁగలనో ♦ చిన్నారినీజానుఁగుల్
కనియన్జక్కఁగ నాలకించఁగదెనా ♦ తల్లీయటంచంతటన్. 92

సీ॥ నూఱురేకులననల్ ♦ గేరుకందుగఁజేఁడు
చందురు సరిమైన ♦ యంచగాఁడు

చేదుకుత్తుకఁగల ♦ జోదుకుఁజెలికాఁడు
జగజగాలకునెల్లఁ ♦ జాగకాఁడు
రహిఁనీలిమొయిలెఁదాల్చు ♦ రాజుకుసైదోడు
గొల్లయిల్లాండ్రకుఁ ♦ గోడకాఁడు.
చుఱుకైన కడుదొడ్డ ♦ చుట్టుకత్తిఁగలాఁడు
సరియైనదణియెజ ♦ గానలేఁడు

కడఁక సిరికుత్తుకకుఁదాళిఁ ♦ గట్టినాఁడు
సొరదిరాకాసి కూటుకు ♦ సూడుకాఁడు
కంసుచెలియలి డొక్కనఁ ♦ గలిగినాఁడు
యట్టి శ్రీకృష్ణుకర్జాల ♦ కంతులేవు. 93

సీ॥ తీరులై కొలలకు ♦ దూరులై తొగలచే
కోరులై కాల్దోయి కొఱలుచుండు
తూఁపులై సరులకై ♦ దోడులై యెన్నుకై
జోడులై చేతులు ♦ సొరదినుండు
టెక్కులై చందిరి ♦ కిక్కులై గుబ్బజతా
లక్కులై నొలని ♦ గ్గలుచుండు
కాఱిమైతొలిసీటి ♦ దారియైనిలిజా
లూరియై యొడలిజా ♦ నూరుచుండు
నింగినెఱసరిజోడుల యంగుకొను
రహింనిచిగురుల సొగసద ♦ రాలతొగరు
కోడెచుక్కల దూరునా ♦ గోరులజిగి
యల్లనారాయణుఁడు గృష్ణుఁ ♦ డనఁగఁగల్గె. 94

తే. గీ. ఉదిరె జేజెకంసుఁ ◆ డుదరించుకర్జాల
కదరి చేఁకుఁగాన ◆ నట్లితజిని
మేఁకుఁ దెంచిసిలి ◆ మోయఁగడచినందు
నాలి కొండునందు ◆ నతనిఁ జేర్చె. 95

ఉ. గొల్లలయూరనందునికి ◆ గోడలయిక్కల కాళ్ళగజ్జెలున్
గల్గనవిలియొల్లెఁడగఁ ◆ గట్టినజోదునుఁ గూడిమాడుచున్
గల్లియశోదవేఁయనుచుఁ ◆ దండ్రియెనందుఁ డటంచుఁజేరఁగన్
అల్లయశోద సందులాగి ◆ నచ్చుగసాఁకుచుహర్షనేచుచున్. 96

సీ. పాకాసిచనుఁ గ్రోలి ◆ రపిం దాని యుసురులు
దుంతకౌతుఁజేర ◆ దోలినాఁడు
శకటనంజుమడింఁడి ◆ టకటొంకునొకకాలఁ
దన్ని నేలనఁగూల్చి ◆ దనరినాఁడు
సుడిగాలిమైటుక్క ◆ పోఁకుఁడుతననెత్తి
కొనిచనఁగుత్తికంటి ◆ గూల్చినాఁడు
తననోటిలో యశో ◆ దకు జగాలన్నింటి
కల్లగాఁగనఁ జేసి ◆ గ్రాలినాఁడు

గూల్చెఁ జెట్టులకొంగ పోఁ ◆ కుఁడునడంచె
దూపరక్కసునజగరుఁ ◆ ద్రుంగఁజేసె
చిద్దుగాఁ జేసె కాళియ ◆ త్రాఁచుగంటు
నతని గండుతనానికి ◆ నతఁడెసాటి. 97

గీ॥ రూపినెరగలి చిటచిట ♦ రొదయెసంగఁ
జుట్టుఁగదిసిన యెఱుఁగొని ♦ యిట్టులాన
గొల్లకుఱ్ఱల నాలను ♦ గొల్లచెలులఁ
గాచినాఁడాతనికె సాటిఁ ♦ గలరెయిలను. 98

ఆ॥ వె॥ సిరియోటిదరిని ♦ నెలఁతలుకోకల
నుంచి గుంపులాడఁ ♦ గాంచిదొంగ
లీలఁగోకలెత్తి ♦ కోలునఁగొనిచని
చెట్టునెక్కియంతఁ ♦ జెలఁగియాడె. 99

ఆ॥ వె॥ తూఁడుచూలినేన్గు ♦ తొండానయెత్తిన
లీలకేలగట్టు ♦ నోలియెత్తి
గొల్లకుఱ్ఱలాల ♦ గొల్లనెలంతల
నగుచునేలినాఁడు ♦ సొగసుఁగులుక. 100

సీ॥ తులసితోఁటన తోడు ♦ కులఁగోక్కులలరఁగఁ
గాయఁ జేతసనేస్త ♦ కాంద్రుఁగూడి
జన్నిగట్టుచెలులు ♦ తిన్నఁగానిడుతిండిఁ
దినఁడెసంతోసానఁ ♦ దనరియెపుఁడ
గొట్టానమూదిరా ♦ గొల్లచేడెలఁఁజీరి
గుట్టులుఁజేయఁడే ♦ కోడిగానఁ
జెలఁగు నాయన్నుల ♦ తలకట్టులన్గూడి
గోంల్లిసేయఁడెచేతఁ ♦ గోలలూని

యట్టినెఱిగంపు టాటోటు ♦ లణఁచుచుండు
సూఁదులనియందుఁజూపు య ♦ శోదసాఁకు
కొడుకుఁ గృష్ణునిలీలలు ♦ నుడుఁగుటకును
నేర్చికైవనుసగు నె ♦ నోయ్యారియింతి. 101

ఉ॥ పిండినికచ్చ ఘోటకుని ♦ లీటిలరాలిచి యన్నఁగూడియ
త్రూరిన కేటిలోఁదనదు ♦ రూడిమొడల్గనఁ జేసియంత చా
ణూరునిచేగచేఁగదిసి ♦ నగ్గుసట్టులదంచికూల్చి స
ద్వారగు కంసుకత్తుక క ♦ రక్కునఁగోసెనతండుతొయ్యలీ. 102

గీ॥ కాపతుంకను దెగటార్చి ♦ కడలినట్ట
నడిన యొకయూపుఁగట్టించి ♦ నందుఁగొడుకు
దొరలుఁజుట్టాలుఁ బలిదంత్రు ♦ లరిటినుండ
జంకుఁగానక రతనాల ♦ సజ్జఁజెలఁగు. 103

ఉ॥ ఇంతటి గండుఁడౌటెఱిఁగి ♦ యిచ్చకడానిఁ గలట్రియింతి యా
గంతుకుఁడైన నేల తెఱ ♦ గంటియొకాతనిఁ దోలనేగి గో
రంతటిలోనఁ గృష్ణుఁగొని ♦ హాయిగరాగఁ జెలంగుతాలిచే
గొంతుకుఁగట్టఁ దానలరి ♦ గోతులలోఁదొలి రాశిగాఁచగెఁ. 104

గీ॥ కడఁక నెలుఁగురాకూఁతుని ♦ కాలుఁద్రొక్క-
సత్తుకన్నె సిరసున సే ♦ సలొగినించె
జానులగ్గింతి నేస్తి చు ♦ ట్టాని చెలియ
లిద్దరినిఁగూడెఁ గాళింది ♦ నేలుకొనియె
నీలనాలుగఁ గొనెఁగదే ♦ క్రాలుగంటి. 105

గీ॥ ఆతనిగోనాలు లగ్గులు ♦ చేతలంగు
చేతిచేగ సొగసుటీకు ♦ జోతిసీలు
లెన్నఁగారాదు తెలిచానఁ ♦ గొన్నజేని
కైనఁ ద్రాఁచుల రారాజు ♦ కైనఁగాని. 106

చం॥ అదియటులుండఁగాఁగడలి ♦ యందునగుండ్రని కన్నుదోయితోఁ
గదలెడి యొళ్ళుతోఁకనెఱిఁ ♦ గ్రాలెడిఱెక్క లెసంగురంగుతో
నదనునఁ జోఱమైకలన ♦ యందునరక్కసుఁ గూల్చితాతకున్
నెదఁజిగిరించఁ దొల్లుమఁగు ♦ లేడ్తెరనిచ్చి జెలంగెఁ జేడియా.107

మ॥ కలుకోనంజుడు దిండ్లుజేజెలొగిజో ♦ కిన్నిటిజేనిద్దగన్
నెఱిఁ ద్రచ్చద్దరి కొండ గ్రుంకఁగని యొం ♦ తేనిద్దిగుజ్జెందితా
రిరు చక్కన్నిలుచుండ జంకనగునే ♦ యేనుండగానంచు దా
సరిగాఁడైయల గట్టునెత్తినొగి ని ♦ చ్చల్దాల్చెకొగ్గింటిదో. 108

ఉ॥ కాటుకకొండనానుదిరి ♦ కంటిరెయినిద్దుఁగాడుఱేఁడు టూ
టోటు తనాన నేలను క ♦ షంగషుఁజట్టఁ జుట్టిచంకలో
నీటుగఁజేర్చి యేగఁగని ♦ నెట్టనఁదానొక యేనుగంతయూ
గూఁటిగఁగల్గి యాచెనటిఁ ♦ గోరనఁజెచ్చెరఁ జీల్చె నెచ్చలీ. 109

చం॥ కోఱకోఱ నూని తానుఁగను ♦ కుజ్జని రక్కసుఁబోటుఁ జేసి నీ
దొరయెటనుండెనోనుడుఁగు ♦ ,తొందరగానని జంకనాడి తాఁ
జఱచిఱలాడగుంజ నర ♦ సింగఁడునై తగఁగల్గి రక్కసు
న్దఱుచగు గోళ్ళఁజీల్చి గుదె ♦ దారినిఁజేరఁగఁదోలెఁ జేడియా.110

ఉ॥ చిన్నెలుఁగుల్కు నీలియొల ♦ చేఁ దనరారుచుఁ జేగఁ గల్గియుఞ్
గొన్నెలకుద్దియౌ నొసల ♦ కోహిఁ శిడొక్కనఁగల్గినేల గై
కొన్న తుటారకక్కసులఁ ♦ గూలిచి నాఁగటిచేత నేల యిం
తిన్నతిమంచఁ జేసెపె ♦ నెచ్చెలికానికి నంజమై చెలీ. 114

ఉ॥ పత్తుక సంకు సాటియల ♦ కొండలగిండుల చెండులన్నుల్
దొత్తులఁ జేయు నెన్నడలు ♦ లోడులజోడు లెడందచూలిచే
కత్తులుచూడ్కు లెత్తులగుఁ ♦ గైజతతండ్రికిఁ దోడిచెల్లెలా
నత్తను గుత్తగాఁగొనియె ♦ నాతనిలీలల నెల్లనుద్ధమఞ్. 115

కం॥ సోఁకుఁడుల రాఁజులగుచు
స్త్రీకోటికలనుండఁగాంచి ♦ తెక్కలిదారుల్
జోక నెదలంట నాడినఁ
జీకాకై రతనిసత్తు ♦ చేడెకొకంటే. 116

కం॥ ఉక్కలరుఁ గత్తిఁ జేఁగొని
జక్కని దానెక్కసుంత ♦ జంకొగిఁగనకఞ్
దెక్కలికాండ్రను గొంతులు
గ్రక్కునఁ దెగ నణుకుచుండు ♦ కడకారునకుఞ్. 117

గీ॥ ఇట్టియొడలులఁ దాల్చిన ♦ దిట్టయుదిరి
నేలునడికట్టుఁ గట్టి తాఁ ♦ జేతఁజుట్టు
కత్తిఁగొని జంకుఁజెందకఁ గడలినడిన
యూరుఁగట్టించి నిలచిన ♦ యుక్కలుండు. 118

కం॥ దుడుకులఁదున్నించుచు గొల్లల
కొడుకులతో నాటలాడు ♦ కోరికలూరన్
దొడుకులఁగాచుచు సోఁకుల
నడుకులఁ జెందించు లచ్చి ♦ నాయఁడు చెలియా. 119

కం॥ చెలియరొ కృష్ణునిచేఁతలుఁ
దలకొనఁ గోటానఁగోట్లు ♦ దర్పోద్ధురుని పై
తెలిసినచేఁతలు నీకుం
దెలియఁగ నేనిట్లనుడిఁగి ♦ తిన్నగ్గ్రాలంటే. 120

గీ॥ నేనునోఁచిన నోఁతలు ♦ నెగడుకతన
కంసుచెల్లెలి కొడుకు డిం ♦ గరులకీగి
చెట్టతని కాలుదోయికి ♦ గట్టి చెంగ
నాలుఁగొట్టితి నోతల్లి ♦ నేలడొల్లి. 121

కం॥ ఆసిరి దొరయడుఁగులు స
న్నాసులెగన లేరుగనుక ♦ నాయెదయతనిన్
తోసానఁ జేర్చియుండుదు
నేసిలుగులేని లగ్గు ♦ లిడుననితల్లీ. 122

కం॥ అని చిలుక కృష్ణుసేఁతలుఁ
గొనియాడఁగ నాలకించి ♦ కోరికలెదలోఁ
దొణుఁకాడఁగఁ గడుగగుబిం
చిన యొడలుంగలిఁగి సకియ ♦ జెలఁగుచునంతన్. 123

చం॥ సిరిదొరగండు నేతలకు ♦ చేగలచేగకు సంతసించి యా
గరిత యెడందనాకు నత ♦ గాఁడె దొరంచనిలోననచ్చి తాఁ
దిరుఁగని హాళినిచ్చు నరి ♦ తిన్నడు కోరికసిగ్గుఁ గృష్ణునం
దరయఁగఁ గల్గియుండనలు ♦ సంతయొసుల్గపకుండదాఁచుచున్. 124

ఉ॥ ఎద్దడిలేనికోరికలు ♦ హెచ్చఁగఁ జల్కనుచుంచుదిద్ది తె
ల్గద్దయె కత్తులానిఁగల ♦ గండరగండని జక్కనైన యా
సుద్దులు సారెసారెకల ♦ జోకఁగనాడిన నాలకించుచు
నొద్దులు కొద్దియాగడియ ♦ లోలిగనెట్టుచునుండె నంతటన్. 125

కం॥ అనియీ తెఱఁగునఁ గ్రీడికి
ననుఁగొకుఱ్ఱనికి కుఱ్ఱఁ ♦ డడుఁగఁగఁ దెలియన్
గనతఁగల లంకచూలికిఁ
దనరెడు కొడుకైనజోగి ♦ తగనిట్లాడెన్. 126

## ఆశ్వాసాంతము.



తోదక వృత్తము:

గడుసులఁ దుంచెడు ♦ కత్తులతుట్టా
యొడయలలో నడ ♦ లూడిన దిట్టా
కడఁగిన రక్కసి ♦ గాండ్రకు నెట్టా
చెడనికయీసర ♦ జేజెలచెట్టా. 127

గద్య:

సీ॥ ఇదినాఁడు కేలు ని ♦ న్నెదలోనఁ దలఁచు డిం॥ గరుఁడ సాదు
లకు సం ♦ గాతికాఁడ। సొగసుసంతునఁగల్గి ♦ జంటి తే
నియలూరు॥ సలుఁదెజుంగులఁ గ్గైత ♦ నాణెగాఁడ॥
రహినికోరాడక్క ♦ రానికిసేత్తుండి॥ కుడితట్టు
సున్న లో ♦ త్తడరుకయ్య। యను
నేను నారాణి ♦ కన్నసజ్జిరిన॥యటు
ల లోకులుఁజీర ♦ నలరునతఁడు॥
తోఁమఁగలుఁగఁ గనదరాల♦
దుగఁదగలని॥ నుడులతో
నచ్చతెల్గునఁ ♦ జెడక
యుండు॥కయిత నోన
రించితినియట్టి ♦ కత
కు రెండో॥ కత
యొనర్చితి నిం
డుగా ♦ కట్టె
జేజె. 128

---

67



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీ

# శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన లక్షణా పరిణయము.

## తృతీయాశ్వాసము.

కం॥ తంటాలు లేని గనుఁడా
జంటారుం గేలజోడు ♦ సత్తిఁగలాఁడా
దంటల గుఱుసుల తేఁడా
కొంటెల కలసూఁడ కుంక్ల ♦ కుంటనసేఁడా. 1

గీ। ఆలకించఁగ దేకట్టి ♦ యనుఁగు కొడుకు
కొడుకునకుఁ జిల్కజడదారి ♦ నుడుఁగునట్లు
చిలుకకృష్ణుని చేఁతలుఁ ♦ జేరి తెలియఁ
జేయలచ్చన తోసానఁ ♦ జెలఁగుచుండ. 2

శా॥ సంతోసాన నెదన్జిగిర్చ దొర ని ♦ చ్చల్లోన నాకూఁతురి
న్నెంతోఁ జెందెను గొత్తయీడు గుఱిగా ♦ నేరాజు కాల్దొక్కి తా
నంతన్గొంతుకుఁ దాళిఁగట్టఁ గలఁడో ♦ యంచున్దగన్జూచుచున్
సంతన్జెన్నగు తెన్నుచెంతఁగల స ♦ జ్జగద్దెఁ గూర్చుండియున్. 3

చం॥ అలమెదతోడులన్నకుల ♦ నందఱుఁ జేరఁగఁ జీరనంచి గ
ద్దెలఁదగఁ గూరుచుండునటుఁ ♦ దిన్నఁగనానతిఁ జేసి యిట్లనున్

దొలకరినీటిదారి జిగి ♦ తున్కయొనాఁదగు నేనుగన్న యి
క్కలికికి నీడెలర్చెనెత ♦ గాఁడొసకుండది నాకనుడ్గరే. 4

చం॥ తెగయల సంతుజాన్గనత ♦ తేజనుచేగయుఁ గీరత్రిజ్ఞగా
సొగసును దేటయున్నిరియు ♦ జోకయు గఁడుతనానిచాగయన్
దగుసరి యీాడుజోడుఁగల ♦ నాయునినారసి కూఁతునిచ్చి చ
క్కఁగనొనరించ లగ్గులిలఁ ♦ గ్రాలునటందురు తొల్లికై సరుల్. 5

కం॥ చెచ్చెర లచ్చనకన్నియఁ
గ్రిచ్చర నొకరాజుకాలిఁ ♦ గాఁజేయుట నా
యిచ్చలరె నెచ్చటుండునొ
యచ్చుగ నుడుగండియీర ♦ లందజునరితిన్. 6

మ॥ అని తేఁడిట్టుల నాడజానుగుల దా ♦ రాలించి జాన్గుట్టలై
తనరన్రిచ్చెడఁ జేసియేగియొకచో ♦ తాతుద్దియాకట్టు చ
య్యన నిండారఁగఁగూరుచుండి యిక నీ ♦ యన్నన్నెఱిన్నెల నొ
య్యన రాతెన్నెదలద్దలంచి కడు తా ♦ రంతద్దగన్గ్రిక్కునన్. 7

విభూతి వృత్తము :

ఆనిజోగులెల్ల తో ♦ సానఁదేలి కూడియున్
జానుగుబ్లుచుండ నా ♦ తేనిఁ జేరి గ్రిక్కునన్. 8

గీ॥ లలినినెఱుకెంతయోగల ♦ తొలినిజోగి
చందురుఁడు జంటితేనియ ♦ సరిఁదనర్చు

తియ్యన్నై నట్టి నుడుఁగులా ♦ జియ్యతోడ
నుడిగె రచ్చనఁగల లోకు ♦ లడరుఁ జెంద, 9

ఉ॥ జానుగనాకసానయిఁక ♦ జాగొనరించక నేఁడుచోర యం
తాసినిఁ జేసికిందికడ ♦ దండిలకోరుల దొడ్డదైన సిం
గాణిని నుంచనేతఁడు తె ♦ గనొగ్గినేసిన నాతగానికిఁ
జానను నిత్తునంచు నిలఁ ♦ జాటఁగఁ జేసిన లెస్సయారాసుఁడీ. 10

గీ॥ గట్టిదోళ్ళ నగారాలఁ ♦ గొట్టుచుండ
నోఁగిదుతారాల సన్నాయి ♦ లూదుచుండఁ
తేర్లగారుల గుఱ్ఱాల ♦ తీరుజెట్ల
తోసఁజనుఁ దెంతు రిలఁగల ♦ దొడ్డతేండ్లు. 11

కం॥ ఇటుదచ్చి కడలఁగలిఁగిన
కొటికలలో నుండుతేండ్ల ♦ కొడుకుల తెగలోఁ
దొటుకింత లేనియూతఁడుఁ
దటకునఁ జేసత్తిచేత ♦ దండిగలాఁడై. 12

సుగంధి:

ఊనిచేఁత గోలఁజేర్చి ♦ యొలిఁదూల యం
తానిఁజీల్చి నేలఁగూల్చి ♦ దండికిచ్చి నీ
కూన నాలుఁగానొసంగి ♦ కొల్చితోల న
ద్దానలచ్చిలగ్గు నిన్నుఁ ♦ దాఁకురాయఁడా. 13

కం॥ ఎఱుకలరారుని జోగి
తెఱఁగున నాడంగనెడఁద ♦ తీఱనియటితిన్
దొరసంతసించి యిది చె
చ్చెరఁ జేయఁగజక్కనైన ♦ చేతఁయటన్నన్, 14

ఉ॥ ఆనయగారియిట్టు లిడు ♦ నానతిచేతని జోగిఁరాయఁడం
గైనదిరాయటంచు నెద ♦ యందున నెన్నికఁజేసితూల యం
త్రిని నేలతేండ్లడలఁ ♦ దానొగిఁగూరిచి దానిక్రింద సిం
గాణియుఁ గోలలుంచి దొర ♦ గారికి జానుగులంటనాడెన్. 15

గీ॥ అనిననాలించి దొరయెద ♦ నరితిఁగనిని
జోగిరాయలఁ దోఁగొని ♦ సొరదినేగి
తూలయంత్రినిఁ గాంచి జో ♦ డాలుఁ జేసి
యన్నికడలకుఁ దెలియఁజే ♦ యంగఁదలఁచి. 16

గీ॥ తూలయంత్రిని గండుఁడై ♦ నేలఁగూల్చు
నాతనికిఁ గోర్కెచేత నా ♦ గూఁతునిత్తు
ననుచుఁగడలెల్లఁ జాటించఁ ♦ జనుఁడటంచుఁ
దోఁచలకునానతిచ్చె నా ♦ దొడ్డరాజు. 17

కం॥ ఈకతలచ్చున జానుగు
సోఁకినఁ దనగుండెలగిలి ♦ సొచయెదలోనన్
జీకాకుఁజెందఁ జేయఁగ
లోకుల కెఱుగంగనీక ♦ లోనఁదలంచెన్ . 18

సీ॥ నాయనతూల యం ♦ త్రానినిఁ గట్టించి
నాయిచ్చ యగుతేనిఁ ♦ జేయజాత
రెంకుకుసాగించె ♦ నీజాడఁగృష్ణుఁ డా
లించెనో లేదో నా ♦ లించుగాక
యిదియెందు కనియాతఁ ♦ డెదరోసియిటురాఁడొ
రహినటులకెలిచే ♦ రాకయున్న
నేనొల్లుసేయుదు ♦ నేఁతోనుడుఁగుదు
నీసేగిఁదీర్చుట ♦ కేముఁగలుగు

యిదికేళిగంటి కొడుకు న ♦ న్నెదనజేర్చ
చక్కఁగాఁ గూడకున్న నే ♦ సైఁచుటెట్లు
లకట తాతయ్యా టకటొంక ♦ టంచుఁగుందు
కడలిలోనీదులాడు చి ♦ క్కట్లుగుడుచు. 19

గీ॥ గండుఁజైసట్టి యొరుఁడు సిం ♦ గాణినూని
తూలయంత్రానిఁ గూల్చి న ♦ న్నేలఁజూచు
సంతనుసుపులుఁ దోలగింతు ♦ ననుచుగొంత
కాలెడుదఁగుందుచుండె య ♦ క్కలికియంత. 20

## చిలుకను కృష్ణుని కడకుఁ బంపుట

కం॥ సొగసుల కెక్కుగు లచ్చనఁ
దగునెనరున నుసురులేల ♦ దగ్గఱచెలియై

నెగడెడు జిలుకఞ్జాలుకు
నొగిఁ జేరఁగఁ జీరిచేత ♦ నుంచి యిటులనున్. 21

కం॥ నానాయన నాచెయిచే
నూనఁగ నాకరాజుకీయ ♦ నొయ్యన చాఱయం
త్రానిని నానరిఁచి దెసల
ఞ్జానుగఁ జాటించు నుడుఁగు ♦ సకిదెలిసినదే. 22

చం॥ అదియటులుండ జానుగుల ♦ యాదునఁగృష్ణుని చేఁగదండియున్
జదురల చాగయంగరితి ♦ జానగునీటుల నాలకించఁగా
నదిసుత రేయినాఁడులిల ♦ నాతఁడు నాదగుఁ గాలుద్రొక్కనా
యెదఁజగిరించుచుండె నిఁక ♦ నేదరిఁ దోఁచదు నాకునెచ్చెలీ. 23

చం॥ సకులెదచూలి సాటియగుఁ ♦ జక్కనిరాజును గోకుచుంద్రు తూ
నిక సరిలేక చక్కనగు ♦ నీటలరారెడుఁ గృష్ణుఁగాఁగి లిం
తకు నెఱిలాఁచుఁ గోరికలు ♦ నాయెదనాటలు నాడుచుండెనో
సకియరో నాతఁడేకరణిఁ ♦ జయ్యననిచ్చటి కేగుదెంచునో. 24

గీ॥ చిలుకనీకన్న నాకు నె ♦ చ్చెలులు లేరు
యెంచియీనేల నంతగా ♦ లించిచూడ
నంతియేగాక నాకక్క ♦ యైతితల్లి
యెంచఁజెల్లెలికోర్కెఁ జెల్లించఁదగదె.

ఉ॥ జంకక నేగినానుడుఁగుఁ ♦ జక్కఁగఁ జేయదలంచి తేనియా
సంకాగిఁ దాల్చురాయనికిఁ ♦ జయ్యననానుడి గానిటాసచే

రంకెలుఁ గొట్టుచున్నవితి ♦ రస్తుల రాజులనేలఁగూల్చి యే
కొంకెదలేక నన్నుఁదన ♦ కొట్టికిఁ జేర్చికొనంగనాడుసూ. 26

కం॥ చెచ్చెరఁజని యో చిలుకా
లచ్చిదొరఘ్నులకు నెఱిఁగి ♦ లగ్గుఁజేర్తి
నచ్చునటులాడి గ్రిక్కున
నిచ్చటికిన్దెచ్చి యుసురు ♦ లీడేర్చఁగదే. 27

కం॥ అనియిటులాడఁగ లచ్చన
కనుఁగగుఁ జెలియైనచిలుక ♦ యాలించియుఁ దా
ననతేన తియ్యనగుఁ జ
క్కని నుడులలరంగ సకియఁ ♦ గని యిట్లనియెన్. 28

సీ॥ తల్లిఁ పికెది సంత ♦ సిల్లుచున్నదొయది
నేర్చుకొలంది యా ♦ డేర్చఁగలను
కృష్ణుని యూరేగి ♦ కృష్ణుకాళ్ళకు గిడి
గిళ్ళనియెదఁ గరఁ ♦ గించియతనిఁ
జయ్యనదంపుతో ♦ జతఁగూర్చియిటకు నేఁ
దెచ్చునందాక నీ ♦ తేటఁజెలఁగ
సాటిచెలులఁగూడి ♦ నాటలాడుచునుండి
యెట్టులోయొద్దుల ♦ నేగఁజూడు

యెడఁదఁ గుందఁదగదు ♦ గడకతో గ్రిక్కున
నేగుదానఁ దల్లి ♦ యెలరుజెల్లి

యనుచు నిట్టులాడి ♦ యాకెనుదిగనాడి
చదలుదారినూని ♦ జనియెఁజిలుక. 29

చం॥ చిలుకటు నింగిదారిఁగొని ♦ చెన్నుగనేగఁగ నంచయాన చే
రలకెనయైన కన్నుదుగ ♦ రంగగుఁగందెర లంటకుండ మూ
డ్కులనొకటే తెఱంగున క ♦ డున్దనసజ్జకు నెక్కిచూచె నా
కలికికి చూడ్కినందుదను ♦ కన్జిగికడ్డుగఁ జేరఁజేర్చుచుః. 30

కం॥ లచ్చనజూచుచు నుండఁగ
నచ్చిలుక కడిందియను ♦ లలకొటికలులో
హెచ్చిన నరితిన్జూచుచుఁ
జెచ్చెరకాళిందియేటి ♦ చెంతకుఁజేరెః. 31

సీ॥ అదితూఁడుచూలుల ♦ యమఁగులఁ గలయది
కడిఁదిరాయంచల ♦ నడకలయది
సుడిగుడ్డుచూలుల ♦ సొగసు చన్నులయది
యొలినురుంగుల ♦ నొలుఁగలది
నీలిసన్ననినాఁచు ♦ నెఱుకలుఁ గలయది
తొడరైనసంకు కు ♦ త్తుకఁగలయది
సాఁగుతేఁటులచాలు ♦ నూగారుఁగలయది
కడుజిగిచోఁటల ♦ కనులుఁగలది

యగుచునొక యందగత్తెయై ♦ యలరు నీటి
గుడ్డుచూలుల రొదలలిఁ ♦ గొనునుమఁగుల

నాఁడు పొంగితరగలచేతు ♦ లట్టిచాఁచి
గట్టునందుండు నిలదారి ♦ కౌఁగలించు
చున్నదో యనఁగాళింది ♦ యొడ్డుఁజేరె. 32

గీ। అందముఁగల చిన్నెలన్నిక ♦ న్నారఁజూచి
తొళసి తోఁటకుఁ జేరి యం ♦ దలరుగుడ్డు
మాలుపూటులతోనేస్తి ♦ సారదిఁజేసి
యచ్చటుండెడి సొగసులో ♦ నిచ్చదీరఁ
గాంచి చెంగట దొడ్డదై ♦ గ్రాలుచున్న. 33

చం॥ దడదడనీటిదారి రొదఁ ♦ దాకిన గుండెలు జల్లటంచు రా
ళ్లడరెడు దొడ్డజల్లు తఱి ♦ చైఁ గురియంగ యశోదకూన తా
గొడుగుగ నెత్తి కొండయల ♦ గొల్లలఁ దొడ్కులఁగాచె నట్టి యీ
నిడుదగు కొండ తొల్లితను ♦ నెట్టన నోఁచిన నోఁతలెట్టివో. 34

గీ॥ ఇట్టు తొడుకులఁగాచిన ♦ గుట్టకెఱఁగి
చుట్టుఁదిగసార్లుఁ దిరిఁగి తా ♦ గుట్టసిరసు
నందునొకకొంత యలసట ♦ డిందనిలచి
యచ్చటూకొని రెక్కల ♦ ల్లార్చి లేచి. 35

సీ॥ అంతింత యనరాని ♦ యంతుదొరకని లోఁతుఁ
గలిఁగి కొనియాడంగఁ ♦ గ్రాలునద్ది
గడ్డలన్నియులోన ♦ దొడ్డగా నిడుకొని
నేలయంతట నిండి ♦ నెగడునద్ది

నెగడికొండులచేత ♦ తగనిజంకిడెడు గో
డిగయింగలాని కి ♦ క్కగున దెద్ది
కడుదొడ్డచాఅతోలిఁ ♦ గలగుర్రిడ్డమూలులుఁ
దిరుగులాడుచునుండు ♦ టెంకియెద్ది

యట్టిచెన్నగు కడలిలో ♦ నట్టనడిన
చేగఁగలగడ్డయూరికి నేగుఁ దెంచి
గాంచిగగురించి యెద సంత ♦ సించిజొచ్చెఁ
గనులతోసాని చినుకులుఁ ♦ దొనుకచిలుక. 36

గీ॥ ఇటులచను దెంచి యాయూరి ♦ యెలరు లెంచి
నిడుదసజ్జల కాళ్ళుంచి ♦ కడలుఁగాంచి
యరితి నెద నెంచి నుడులల్ల ♦ నాలకించి
కృష్ణుచేతలునగ్గించి ♦ కీడుదుర్రించి. 37

కం॥ తిగగంటల కొకసారిగఁ
దగిననగారాలు లలితు ♦ తారలరొదలుఁ
నెగడుచు నుండెడి కృష్ణుని
జగిఁగల్గిన నగరుఁగాంచెఁ ♦ జిలుకసరగునన్. 38

సీ॥ నేలతాత యొనర్చు ♦ నీలిరాజ్లెక్కిన
చక్కని దొరలుండు ♦ చదరుఁ జేరె
కడలి యల్లుని జూడఁ ♦ గనలేక యచ్చోటుఁ
గదలితొల్త టెయ్యాలి ♦ గట్టిచికిలి

గుజరాల్ రతనాల ♦ కోటగోడలతోడ
చదలు నోరయుచుండు ♦ సజ్జఁజేరి
చెంగటి యుదిరి య ♦ రుంగుల నెత్తాల
కిలకిలలాడు రా ♦ చిలుక కూటఁ

గీ॥ జూచినందునికుఱ్ఱఁ డే ♦ చోప్పటఁగలఁడో
నా కెఱింగించుడన రత ♦ నాలసజ్జ
యుండఁగల సత్తు చెలితోడ ♦ నాటలాడు
చుండినాఁడిట లేఁడేగు ♦ కండదిండి. 39

సీ॥ అనజానుగులతోడ ♦ నాలించి యాచిల్క-
యచోప్పటుఁ గదలి తా ♦ నిచ్చఁదలఁచె
సుంతైన నోర్చని ♦ యింతి యాసత్తుతోఁ
గూడి యాడెడు నందు ♦ కొడుకుతోడ
నాదోర కూఁతుకీ ♦ నాఁడంచు కర్జాని
తెలియఁజేయంగ నా ♦ కలికి కెఱుక
గలిఁగెనా కర్జాని ♦ గంగలోఁ ద్రోయును
గనుకనా జెంత చెం ♦ గటనలేని

గీ॥ నిరుకుఁ గనుఁగోని యా కన్నె ♦ నిగ్గుజగ్గు
సొగసు చిన్నారికులుకు య ♦ శోదసాకు
కొడుకు జానుగు నాటించ ♦ కోసనట్టు
లెన్నికలుఁ జేతురిల తేఁడు ♦ సన్నునేలు. 40

కం॥ అని కృష్ణుని తొలియిల్లాల్
ననతోఁటకుఁ జేరియందు ♦ నారింజలుఁ దాఁ
దినుచుండి యచ్చటుండెడు
గనతగు లీలలను చిలుక ♦ గనుఁగొనుచుండెన్. 41

గీ॥ అంత లచ్చన కన్నియ ♦ యలయశోద
కొడుకు రాకడ డెందానఁ ♦ గోరుచుండి
తోడి చేడియ కూటుతోఁ ♦ గూడి యాట
లాడుకొనుచుండి నాఁడుల ♦ నూడఁదోలు. 42

—* వసంతర్తు వర్ణన *—

కం॥ అంతటఁ దొలితటి రాగన్
సంతోసానెడఁదచూలి ♦ సౌరగుదంపుల్
రంతులుఁ జేయుచుఁ దోఁటల
గొంతుల కెగదట్టఁ దినుచుఁ ♦ గ్రోలుచునుండున్. 43

సీ॥ చెట్ల యీరికలెత్తు ♦ జిగురుటాకులుఁదిని
కొలకొలలాడు కో ♦ యిలలదండు
యీరాల నన తేనె ♦ నోరూరఁగా జుర్రి
తెరిగాణలుఁ జేయుఁ దేఁటికూటు
తియ్యని కాయలఁ ♦ దిని తేనె లొలికెడు
నుడులాడు జిలుకల ♦ నడరుఁ దెట్ట
నేలచూలుల కడు ♦ నెత్తాలయందుండి
రేకెత్తి యఱచు గో ♦ రింకగుట్ట

గీ॥ కోడి కూసెను తఱిఁదీగ ♦ కొనలయందు
దూరిన సమారుతోఁగూడి ♦ తేరిదక్కి
నాని చల్లనిగాలి యెం ♦ తేనిఁ దోలు
చుండు లోకులు నలర నా ♦ రెండు నెలలు. 44

సీసమాలిక.

అట్టికారున కలి ♦ గొట్టు తాడీఁదాడు
కొడెసె తక్కెడ కొండ ♦ గోఁగు రేఁగు
కోడేర యుసిరిక ♦ గోరంట యందుగు
నేరేడు జాజి యం ♦ జూరగార
చింత యూముగనంటి ♦ చిందుగు కుంకుడు
తాడలొద్దుగుజాల ♦ తాండ్ర(తిండ్రి)
తొలిమైన చెట్లచేఁ ♦ జెలఁగుఁ దోఁటయొయారి
కారనియెడుకోడె ♦ కానినిచెయి
యెత్తిజేరినదానా ♦ నత్తఱిఁజెట్టుల
సిరసుల సురిగల ♦ చిగురు లలర
నాయనా కలికిని ♦ డాయంగఁజనియాడు
చొక్కి కోరల నొక్కు ♦ నొక్కులనఁగ
తొగరైన యీరాల ♦ నెగడు తీఁగెల కొన
కూనల చాలులఁ ♦ గులుకుఁజెంది
యా నెలంతుక జోడు ♦ కానినిఁగఱిగించ
నలరుల దండల ♦ నక్కుఁజేర్చి
యెదకొంగుఁ దొలఁగించి ♦ యుదుటు చన్నులుఁజూపఁ
గాఁజేసెనో యన ♦ గాలిఁగదలు

నాకులసందున ♦ జోకతోఁగననగు
కాయ గుత్తుల తెగల్ ♦ గ్రాలుచుండి
యారాయఁడెదచూలి ♦ యాలానఁ జొక్కించ
నలసటఁగల నీరు ♦ జలజలంచు
రాలెనోయన నన ♦ లోలికాయలనీరుఁ
గురిసి జాలుగ నేగి ♦ దరుల నేగు
చక్కని గొజ్జంగి ♦ జాలులోఁ దగులీలఁ
జేరియేగెడి దొడ్డ ♦ యేరునందు
దొన్నెలు తిన్నెల ♦ చెన్నుఁగాయనఁ జెల్లి
గుఱుతుగాఁ దేలిన ♦ తెరలయట్లు
లుండెడి ననచూరు ♦ నిండారనిండిన
సుడిగుడ్డుచూలులు ♦ సారదినుంపు
నీరు చూలులఁగాంచి ♦ నెట్టన యరితిని
చన్నుల గందాని ♦ చెన్నుఁజేసి
కొని యాటలాడఁగఁ ♦ జనుదెంచు జేజేల
గరితలంచనియెడ ♦ ల్గట్టిఁజేయ
జాలకతానాల ♦ కూళడాసినజడ
దార్లతీరున జాలు ♦ దరినిఁజేరి
చెలఁగి యాడలుఁగల ♦ చెట్లచాటునడాగి
కోలలచే కొండ ♦ గొల్లఁదుర్రించ
జతగూడినట్టి చెం ♦ చెతలఁగన్గొని జంకుఁ
గొని యేగు జింకల ♦ కనుల సొగసుఁ

గలిఁగిన కనుదోయి ♦ గల నెలంతుకలను
గదిసి యెడఁదచూలి ♦ కలనఁగలుఁగు
సరితినిఁజేయు కి ♦ న్నెరదండునకు నట్టు
లై జెలంగెడు సన ♦ లలసుతేఁగె
టింప్ల నెత్త్రాలయం ♦ దెడలేక నిచ్చలుఁ
గదలు తేఁటుల కూటు ♦ రొదల కదిరె
యెడ దీసరుల నెదఁ ♦ గుమురుగాఁ గౌఁగిటఁ
గదియించు నెడ యిక ♦ గలుఁగు గరిత

లట్టులఁ జెట్టుల ♦ గట్టిగాఁ జుట్టల్లి
కొను తీఁగెలందాల ♦ కోర్కె లలర
నిరు తెగలాడెడు ♦ నెఱి నిచ్చనుగ్గుల
నెదలిగిరించ ను ♦ య్యేలలూఁగు
జేష్ల రాణుల సరుల్ ♦ తెక్కొనునటులున్న
చిలుకల దంటల ♦ కలకలాల

సుం జంటలై చెట్ల ♦ కొనలందుఁగల చిగు
రాకులుఁదిని యొజ్జ ♦ లైన కనులుఁ
గలుఁగుకోయిలలు చ ♦ క్కని యుడ్డనొండైన
నెఱిరొద కెనయు కీ ♦ న్నెరల నూని
గానించుఁ దెఱగంటి ♦ గరితల గాఁజుల
కలయుచు నాటల ♦ నాడుచుండు
తాఁచుల యొడయల ♦ తలలయందునఁగల
రతనాల నిగ్గుల ♦ రాణకెక్కు

చిగురాకు కొఱుదుల ♦ సొగసులుఁ గనుఁగొని
కొమలుఁగల్గిన చిచ్చు ♦ గడలటంచు
జంకి యుకికెడి యెల్గు ♦ లెంకల యొడలుల
నల్లని జిగి నిగ్గు ♦ నల్లికొనుచుఁ
జీఁకటి చెట్టుల ♦ చెలగీరికలు నీరు
దారులంచనియెడం ♦ దలఁదలంచి
తోఁకలు తలకెత్తి ♦ జోకనాడెడి నీలి
కుత్తుకల్ గల గుబ్బిడు ♦ కూనకూటు
నారింటఁ గలరొద ♦ కరయ జోడగు నిషా
దాని రొదల్ సేయు ♦ చూనికొండ
లండూడిజారిన ♦ గుండుల లీల నే
తెంచిన యేనుఁగు ♦ తెట్టకొలఁకు
లలదరులను దిరుఁ ♦ గాడుచునుండ నా
జంకొంది నన్నేల ♦ జాగు లేక
హరిరాగ దేయంచు ♦ సరగఁజీరుచునున్న
దోనాగ కడుదక్కి ♦ నానిగాలి

గీ॥ కదలుచున్నది యైతేంట్ల ♦ రొదలచేతఁ
గూడుకున్నదియైనట్టి ♦ తూఁడుచూలి
సంతు దరిఁ దిరుఁగుదుగిను ♦ జక్కుకూటు
గరుల నిగ్గుల చాలు చం ♦ దిరికలగుచు
దెసల నిండారి తొలికారు ♦ తేజరిల్లు. 45

## —§ వనవిహారము. §—

చం॥ లలిఁ దొలికారునందుఁ గడు ♦ లచ్చననాఁడులుః దోలలేక చె
న్నలరెడు తోఁటలోఁ దిరుగు ♦ నాసయెదన్గదలించఁ దోఁచి నె
చ్చెలులను సంతసానఁ దన ♦ చెంతకుఁ జేరఁగఁ జేరనంచినన్-
జలుకల కొల్కులెల్ల రటుఁ ♦ జేరి జోహారులుఁ జేసి నిల్చినన్. 46

గీ॥ అంత లచ్చన చెలులను ♦ సంతసానఁ
జూచి నాయెదలో నేదిఁ ♦ దోఁచకుండెఁ
గనుక యలరులతోఁటకుఁ ♦ జనియొకింత
తఱిని దాటించి యిలుఁ జేరఁ ♦ దలఁచి యీఁకు
జాడఁ దెలియంగఁ జేసితిఁ ♦ జానలార. 47

కం॥ అని నుడిఁగి గరుడిరాలనుఁ
దనరారెడి యందలానఁ ♦ దగనెక్కెను ల
చ్చన యొడలి తొడుఁగు లెంతో
కొనియాడెడి నిగ్గులలరఁ ♦ గొట్టికఁ గదలెన్. 48

సీ॥ అరిదిఁగల్గిన హొన్ను ♦ హాసుకట్టులుఁ దాల్చి
చానలుఁ గొందరె ♦ చ్చరికఁ జేయ
నిరు కెలంకులఁ జేరి ♦ నెఱికిన్నెరుల నూని
గాణాలు కొందరుఁ ♦ గడఁకఁ జేయ
రతనాల జతగూర్చ ♦ రాజించు నడిగట్టు
లడుఁగుల నిడనొత్తు ♦ నడచిరాగ

నాణుల జాలరు ♦ లలరు గొడుగొక్క చేఁ
గొని యొక్కనాతి చెం ♦ తనఁజనంగఁ

గీ॥ దక్కఁగల యంచయానలా ♦ చక్కి నిలచి
గుట్టలై గొల్చుచుండంగ ♦ గట్టుసూఁడు
కాని యిల్లాలి చందానఁ ♦ గ్రాలుచుండి
సారది లచ్చన యేగుచుఁ ♦ జూచెనెదుట. 49

చం॥ వనలకుఁ దీగెటిండ్ల కిల ♦ నాటిన నేచుచునుండు చెట్లకున్
దోణికెడు తేటనీరుఁగల ♦ దొడ్డకొలంకులకున్నిరాజిగ
చ్చునవలరారు రచ్చలకు ♦ జోడులనూడని గుడ్డచూలి కూ
టునకల రొడ్డుదారులకు ♦ టొకులకిల్లగు గోఁట తోఁటయున్. 50

కం॥ కనులారఁగాంచి యా సాగ
సునకె దనరు సానఁదేలి ♦ చూచెడితఱిలో
ననచిల్కుదారి గుజ్జా
లనునగునుడుఁగుల నోయారి ♦ లలికూన లొగిన్. 51

మత్తకోకిల.

అంతఁ జానల యాడులందున ♦ హాయిగా నగులీనఁగా
యింతి లచ్చనతోడఁ గూడి ర ♦ హిన్నిరాజహులుసారులై
సంతసానలతోఁటలోఁ జొరె ♦ జాలుగాఁ గడుజోలిగా
గొంతి చూలులఁగాచుఁ గృష్ణునిఁ ♦ గోరి యిచ్చలనెన్నుచున్. 52

గీ॥ ఇట్టులనన తోఁటలోఁ జేరి ♦ యొలయునంద
లాని నొకచోటడిగ్గి క ♦ డాని సొగసు
నడచు నడిగజ్జలను జిగు ♦ రాకు కాలు
దోయినిఁ దాఁకిఁగి చేయూఁత ♦ నీయ కలికి. 53

సీ॥ తన తల తూఁపుచూ ♦ లెనయుగందానికిఁ
గదియఁ దేఁటుల కూటు ♦ లెదుయు రాగఁ
దన జుంటితేనియ ♦ కైనయైన నుషులకుఁ
జలుకలదండు సి ♦ గ్గిలుచునుండఁ
దన కీలు గంటును ♦ గని చిన్కదారియం
చని సిలికత్తుక ♦ లాటలాడఁ
దనచేతి తొగరి రు ♦ దరులఁ గ్రాలుచునుండఁ
జిగురాకులకుఁ గ్రొత్త ♦ సొగసులిడఁగఁ

గీ॥ దాఁడను గిండుల చన్నుల ♦ దొడ్డనకును
నేల నూకొని నపుఁగిడ ♦ నోలిజంకి
గడగడయటంచుఁ గానెంతో ♦ గదలుచుండఁ
దోఁటలో నాఁడుదిరిఁగె నా ♦ జోటి యలరి. 54

కం॥ కలికీ యీ చెట్టుల సరి
గల నుండెడి చిగురు తలలఁ ♦ గల ననకూనల్
లలి దొడఁగులట్లు సందెనఁ
గల చదలు నరిక్కకూటు ♦ కన్నులఁగంటే. 55

గీ॥ అంచయానరో యలరుల ♦ యందుఁ జేరి
తేనెలలిఁ ద్రాగుచున్నట్టి ♦ తేఁటి తెట్టె
నీటుఁగల నిముఁగననన ♦ తోఁటలచ్చి
కనుల నల్లనిగుడ్లనఁ ♦ గ్రాలెఁగంటె. 56

సీ॥ ఇట్టులా చేడెలు ♦ గట్టిగా లచ్చన
యల చెల్లసొగసులుఁ ♦ గలయఁజూడఁ
జేయుచుఁ దేఁటులఁ ♦ జెలులఁ దెఱంగున
గాణాలుఁజేయుచు ♦ గొరుచాన
లట్టుల నడుచుచు ♦ నాడుచిల్కల లీల
కలకలనుడులు చ ♦ క్కఁగనుడుఁగుచుఁ
జెట్ల కురుకుచుఁ గొండ ♦ సిరసుల కెక్కుచుఁ
దేనియల్ ద్రాగుచుఁ ♦ దీఁగెటిండ్ల

గీ॥ లోన దూరుచుఁ గొండల ♦ లోయలెల్లఁ
దొంగిచూచుచు నలరులఁ ♦ ద్రుంచిరెమొషుల
నిండ నించుచుఁ దోఁటలో ♦ నీటుఁగులుక
నెన్నియో లీలఁదిరుఁగుచు ♦ నెదలలోన. 57

సీ॥ కడు చొఱకుద్దియా ♦ కనులు నీకుంటేని
సుడిగుడ్డు చూల్చును ♦ జోడుదాన
సుడిగుడ్డు చూల్చును ♦ జోషునీకుంటేని
నింషుచందురు తల ♦ నెగషుదాన

నిండుచందురుతల ♦ నీకొగినుంటేని
కాశైన త్రాఁచుమా ♦ గారుదాన
కాశైన త్రాఁచుమా ♦ గారునీకుంటేని
నీలికుత్తుకతోక ♦ నెఱులదాన

గీ॥ ననుచు నొకదానితోనొర్తు ♦ హాయిగాను
నిగ్గు సొగసులతో హెచ్చి ♦ లగ్గుఁ గొనుచుఁ
దోఁటలోఁగూడితిరుఁగుచు ♦ దొరయుఁగోర్కె-
లడరఁజేడియలరితియా ♦ నుడుల కలన. 58

ఉ॥ వెంజలిలేక నొక్క-చెలి ♦ నీటు నిషాదిని రద్దిఁజేయుచుఁ
గుంజను సుంగుఁగాగ నెద ♦ కొంగుఁ దొలంగిన చన్నులేచి నా
రింజలఁ జేఁగొనంగనగ ♦ రేయలరారెను గీఁకతోడఁ జే
రంజని హత్తిచేననల ♦ రాల్చుచునున్నదొ నాగనత్తఁడే. 59

సీ॥ ఒకతె నలరులఁదెచ్చు ♦ నొకతె కాయలనెంచు
నొకతె యాలించు నిం ♦ కొకతె గాంచు
నొకతె మాటల నోడు ♦ నొకతె మెక్కను తాడు
నొకతె చెలియలఁగూడు ♦ నొకతె యాడు
నొకతె చిలుకలఁజేరు ♦ నొకతె కానుకఁగోరు
నొకతె కొలనకుఁజేరు ♦ నొకతె గేరు
నొకతె తీఁగలలాగు ♦ నొకతె యుయ్యేలలూఁగు
నొకతె చాటునడాఁగు ♦ నొకతె యేఁగు

గీ॥ నొకతె యెగతాళి నుడులకు ♦ నోలిఁజిక్కు
నొకతె యెదచూలి కడుకోల ♦ లకును సొక్కు
నొకతె కోట్లాటఁ గనుఁగొని ♦ యొకటనిక్కు
నొకతె గంతులుఁ జేయుచు ♦ నుండుఁజూడ. 60

గీ॥ చెట్టుచెట్టుకు నొకతియై ♦ యిట్టులానఁ
దిరిఁగిరలతోఁటగోరుల ♦ కరణిఁగాఁగఁ
గాళ్లిలు గంటులు సంతోస ♦ కారులగుచు
కొంతతటి కందటొకచోట ♦ గుట్టలగుచు. 61

## —‡ దోహదములు. ‡—

ఉ॥ అన్నరొసాటి నీ చనుల ♦ కంచు నొకర్తుక చెండులేయఁగా
గొన్నిన చిల్కదారి కడుఁ ♦ గోలలయట్టులఁ జన్నులంటఁగా
నున్నయెదన్ని సీయనుచు ♦ నూర్చిన చెంగటి సిందురానిఁదా
నన్నిఁటి కెక్కుడైన నన ♦ లందెను తేనియలూరుచుండఁగన్. 62

ఉ॥ కోరిక లీనుచుండ నొక ♦ గోలయదాటున కొండగోఁగునన్
జేరిన చిల్కతో నుడులు ♦ చెన్నుగ నాడుచునుండ నానుడుల్
తీరెనఁ దిన్ననై నవన ♦ తేనియలూరుచునట్టి చెట్టునం
దారయ లెక్కలేనినన ♦ లాదటఁ గల్గె జరీన నెంతయున్. 63

ఉ॥ జింకలఁదోలు కౌనుగల ♦ చేడియఁ గన్గొని యేన్గుగంటునా
జంకుచు నొక్కగొరుఁజనఁ ♦ జానగలంగుచుఁ గుత్తుకెత్తి తా

రంకెలుఁ జేయఁ జెంగట సి ♦ రాజకడానియ నేటిచెట్లు జా
నుంకుగఁ గల్గెఁ గ్రొన్ననల ♦ నోలిగఁ దేఁటుల నీటుడిందఁగన్. 64

చం॥ ననలను ద్రెంచుకోర్కెఁ నొక ♦ నాతుక యెచ్చటలేని చెట్టునన్
ననలను లేకయుంటఁ గసిఁ ♦ దాలిచి యందెలకాలు గల్గు గ
ల్లనొక తన్నుఁ దన్నఁ గనె ♦ యంతటఁ దీఁగకొన జ్జెలంగ సం
మనఁ గమ హాళితో ననలఁ ♦ దొంపరగాఁ గొనుచుండె సత్రజిన్.

ఉ॥ చన్ననలార నో సుజత ♦ చేనెలఁ జూచియుఁ జూమడంచుఁ దాఁ
గ్రొన్ననఁ జెంతనున్న తిల ♦ కానిని చేరలనేలు చక్కనౌ
నన్నులతోనెగాదిగ త ♦ గన్ననికొ్రొన్ననలీనఁ జేయ నా
కన్నెలు నీకు సాటిఁగల ♦ కన్నెలు లేరని యుగ్గడించఁగన్. 66

గీ॥ ఇటుల ననుఁదోఁటఁ దిరుఁగుచు ♦ హెచ్చరించు
లలిర సయ్యాటలాడుచుఁ ♦ గులుకుచెంతో
యలసటలుఁగాంచి నొకచోట ♦ నందఱితి
గుట్టలై గూడి నిలుచుండి ♦ కోదెయెదుట. 67

సీ॥ నూఱు రేకుల ననల్ ♦ దూరి తేనెలుఁ ద్రాగ
నీటుగాఁ దిరుఁగాడు ♦ తేఁటికూటు
కొంగలంచలునీరు ♦ కోళ్ళు తొల్లిగ గుడ్డు
చూలుల కలకలా ♦ ల్గ్రాలుచుండ
జెలగలచోఁజలె ♦ జ్జల నీరు కోఁతుల
నీటియసులకెల్ల ♦ నీడయగుచు

నీటి తొంటుకుల దరి ♦ నేలయేచినఁజెట్లఁ
జల్లని నీడల ♦ సౌరుఁదనరఁ

గీ॥ దోలుగాలికిఁ గదలి నె ♦ త్తాలఁ దొగల
ననలరాలిన చూరుగం ♦ దానికిచ్చ
నిచ్చలలరారిలోకులు ♦ నిలుచుకొలకు
చెలఁగు తీయని నీరుండు ♦ కొలఁకొకండు. 68

కం॥ అల ననలతోఁటఁ గలిఁగిన
లలిసొగసుల నీనుచెట్టు ♦ లన్గనుఁగొని యిం
తులుఁదిరుఁగులాడు సేదనుఁ
దొలుఁగగ నీరాడఁదలఁచి ♦ తొందరగదురన్. 69

ఉ॥ కంచెల నూడఁదీసి సరి ♦ కట్టుల చీరెల నొడ్డునుంచి రా
ణించు నగల్ సడల్చి నెఱి ♦ నీలికురుల్దిగజారనట్టుగా
నంచెలుఁగట్టి చేడియలు ♦ హాయిగ నందఱుఁ గేలుకేలుఁ గీ
లించి కొలంకుఁజొచ్చిరిల ♦ లేని హుసారు లెదజ్జెలంగగన్. 70

ఉ॥ జానుగలట్టి యాకొలఁకుఁ ♦ జక్కఁగఁజేరి కడింది కోరికల్
యీనఁగనందుఁ గుప్పింకులిడి ♦ యీఁదుచు లేచి సిరాజికేలు కా
లూనిజిరాన దూఁకి రొద ♦ లుడ్గకనవ్వులు నీటఁగొట్టుచున్
జానల కూటునీటఁగడు ♦ సొరుగనాటల నాడిరత్తఱిన్. 71

కం॥ నెత్తాల నీఁదుచేడెల
నెత్తులుఁజేతులునుకాళ్ళు ♦ నెక్కొనుగన్నుల్

నత్తాలై యుండుటచే
నత్తాలకు పెంకియనెడు ♦ నెఱిగుఱుతొందెన్. 72

సీ॥ నిగనిగలాడెడి ♦ నెరుల జక్కఁదనాలు
నాఁచుతీఁగెలనేల ♦ రాచుఁజూడ
సొగసైన చన్నులు ♦ సుడిగ్రుడ్డు చూలులఁ
గలన నెదిర్చి చీఁ ♦ కాకుఁజేయ
రహి దొడ్డచేర ♦ లేరాంగ్రైన కన్నులు
తూల తళ్కులఁ గ్రిందఁ ♦ ద్రోయఁజాలు
తొగరుచాయలనిగ్గుఁ ♦ దగు నరచేతులు
నీరుచూలులనిక్క ♦ నీటఁద్రోయుఁ

గీ॥ దుంట్లు తిన్నెలఁ గసిఁగల్గి ♦ తూలనాడ
కాలినెత్తులు దాసరి ♦ గాండ్రిదూరఁ
గుత్తుకలు సంకులన్గేలిఁ ♦ గొట్టుచుండఁ
జానలీలీల నీరాడ ♦ సాగిరందు. 73

కం॥ తలయెత్తి యీఁదుచుండెడు
చెలి జడఁగనుఁగొనఁగనయ్యెఁ ♦ జెచ్చెరఁ జలికైఁ
గలదంటనంటి కఱచెదఁ
దలఁగక నవియురుకులాడు ♦ త్రాఁచాయనఁగాన్. 74

గీ॥ కులుకుఁజెలియోర్తు నీటిలోఁ ♦ గ్రుంకిలేచి
నిలచి నస్నలి నెఱకలా ♦ నెలఁతచన్న

దంటఁ దగనల్లికొనఁజూడఁ ♦ దగెనుగట్లఁ
జినుకుదారులు కడుఁగది ♦ సెనో యనంగ. 75

ఉ॥ నాతి యొకర్తు చేత సిరి ♦ నట్టాగిఁ దాల్చినయట్టి కేలు నెం
తో తగనాసనంచదొర ♦ తూఁడుగదాయని నోటగుంజయాం
గోతిగిలిజ్జరీనసిరి ♦ గూఁడిలఁదోఁచినఁ దోడినెచ్చెలుల్
చేతులుఁగొట్టుచున్న గిరి ♦ చెచ్చెర దానినిఁజూచి యంచనున్. 76

సీ॥ ఓలయోలోయని ♦ యొకచేడె నుడ్డఁగా
నొకజోటి దాని నం ♦ టికొనియలరె
నొకచెలి సిరియిండ్ల ♦ నోసరిలజల్ల
నొకయింతి తొగనన ♦ లొడల నూకె
నొకనాతి కొలనలో ♦ నికిదిగి యీఁదంగ
నొకగోతి యమఁగుల ♦ నొడిసిలాగె
నొకచాన నోటిలో ♦ నూనినపీరూయ
నొకకల్కి నీటిలో ♦ నొదిగిచల్లు

గీ॥ నొకచెలియ నాఁచుతీఁగెల ♦ నోలిఁదెంచు
నెలఁత యొక్కర్తు గనుఁగొని ♦ కిలకిలనగు
నొకచెలియ యెక్కుడలసట ♦ నొందుచుండు
నొకగరిత నీటియాటఁబడ్డి ♦ యూరకుండు. 77

కం॥ జోటితలకట్టులరెరే
నీటండిగి నీటియాట ♦ నెఱియాడిరి యే

లోటింత యంతలేకొగి
నీటఁగల తేటజారి ♦ నీరసలయ్యెన్. 78

ఆ॥ వె॥ నీరు దారినుండి ♦ చేరఁజేరిన తళ్కు-
లనఁగ జిడ్డుకడలి ♦ యందునుండి
కదలి యేగుదెంచు ♦ చదలు కోటికజోటు
లనఁగ కొలనదరికిఁ ♦ జనిరి చెలులు. 79

గీ॥ అట్లు చేరెలు చల్లని ♦ చెట్లనీడ
లందు నిలచి యొడళ్ళనఁ ♦ జెందునట్టి
నీటితడియొత్తుకొని గోళ్ళ ♦ నెఱులుగీరి
యూప్పుకొని సంతసించుచు ♦ నడచిరంత. 80

ఉ॥ చెంగులు జీరలాడ జరి ♦ చీరెలుఁ జక్కఁగఁగట్టిచన్నులం
దంగగు కంచెలల్ దొడిఁగి ♦ యాలి యొకింతయు లేని.కస్తురీ
రంగు నొసళ్ల దిద్ది నెల ♦ రాసరు లట్టునఁ దాల్చి యత్తరుఁ
దొంగలి రొమ్ముళ్లరాసుకొని ♦ తోనవలూనిరి నెత్తులందునన్. 81

గీ॥ కొలన తొలిదెస దరిచెట్లు ♦ గుట్టనడిన
ననల చూర్నిండు గొజ్జంగి ♦ పొనఁదనర్చు
జాలుదరియాట కొండయూ ♦ రాలచెంత
దాక ననతీఁగెటిండ్లలో ♦ జోకఁజేరి. 82

గీ॥ ఒక్క చక్కని చోటున్న ♦ లోఁజఁజూచి
యగలుగందాని నీటితో ♦ నలికియూణి

చూరుతో జల్గుగీతలు ♦ సొగసుదనరఁ
గా నొనర్చి దనరు జడ్డు ♦ కడలిఁగట్టి. 83

కం॥ ఒగిజడ్డు కడలిక్రిందను
తొగచెలిరాతిన్నెఁ గూర్చి ♦ తోడ్తోదానన్
సొగసు సిరిగద్దె దుద్దును
దగఁజేసె చిదాని తలన ♦ దండియొడఁదలై. 84

గీ॥ సారది కస్తూరిచే నెడ్ద ♦ చూలిఁజేసి
యతని డాకడరతినుంచి ♦ యలరు నెదుటఁ
దొగల రాయని ననకారు ♦ దొరను జేర్చి
కెలఁకులను నింగిచూలి కో ♦ యిలలఁగూర్చి. 85

గీ॥ నెలఁతలందఱు గొజ్జంగి ♦ నీరుఁదొగలుఁ
జిగురుల నటులు సిరియిక్క ♦ లగలుజాజు
లెలరు కస్తూరి ననతేనె ♦ లెడఁదచూలి
నిగ్గు నగ్గించఁగాఁ గొని ♦ నేఁడుగూర్చి. 86

సీ॥ గుజిమొదలంగల్గి ♦ సిరికూనయమఁగుల
జానుగాఁ గడిఁగి తా ♦ నానఁ దేర్చి
జల్తారుగుడ్డిచ్చి ♦ చక్కఁగా కుడిదెస
జందేనిఁ జేరిచి ♦ చందనాని
యలరు కస్తూరిచె ♦ న్నడర నొసటదిద్ది
ననదండ లెదనిండఁ ♦ దనరనేసి

యగలిడి సీసుచూల్ ♦ రగులుకొనన్జేసి
సొగసైన గాలూరు ♦ జోతినిచ్చి

గీ॥ యుదిరి కానుకఁ దగఁజేర్చి ♦ సదరుననల
నొసఁగి యాకులు సిగినాలు ♦ నొనరఁగూర్చి
చుట్టు చిల్కాను దొరకూన ♦ చుట్టుఁదిరిఁగి
మొఱఁగి నగ్గించి రపసాన ♦ నింతులనిరి. 87

ఉ॥ ఈలలి రాచకూఁతు రెద ♦ నెంతయుఁదాతయుఁగూడి కోరికల్
జాలుఁగొనంగనట్టిదొర ♦ చక్కని సజ్జన సెజ్జనుండి ని
న్నోలి మొఢందలోఁ దలఁచు ♦ చుండెడసేయక కాయలాకు గం
దాలగలున్ననద్దగున ♦ నంటులఁగూరిచి లచ్చికుజ్జఁడా. 88

గీ॥ అనుచు నాదొరసాదానిఁ ♦ గొని చెలియలు
మెలరుకొటికకుఁ గదలిరా ♦ యందళాని
యందు నచ్చెలిఁగూర్చుండు ♦ నట్లుఁజేసి
కొని నెలంతుక లూరికిఁ ♦ జనిరి సరగ. 89

కం॥ తోఁటఁ దిరుఁగాడి యాదట
నీటందగు నాటలాడి ♦ నెగడెడినట్టుల్
జోటులుఁ జేరిరి జేజే
కూటికిసరి నుద్గులాడు ♦ కొనుచుఁ గడంకన్. 90

## —❖ సూర్యాస్తమయవర్ణన. ❖—

చం॥ తఱియగ సాలిరేచలియ ♦ తాఁదలఁదాల్చగడానితేసు చె
చ్చెరఁ దొలికొండ జాన్గదురుఁ ♦ జేరిచియుంచిన కారుచిచ్చులో
గుఱుతుగఁగాచి నీరుఁగల ♦ కోరనఁజేరిచె నాగయంతటన్
సరగునఁగుప్పింకుజాలుదొర ♦ జాలునఁగ్రుంగిలెఁ జాయవాయఁడున్.

చం॥ కనలుచు లచ్చికూనెడయు ♦ కాఁకనఁగ్రాఁగెడు లోకులెల్లరన్
దననెఱి దండ్లు రంతులిడి ♦ తారసిలన్జనుఁదెంచి చేతి స
త్తిని సరినాకులేరనుచుఁ ♦ దేఁటియరిన్సరిఁజేసి గుంజురం
తనఁ దన ఱెక్కదారి తెగ ♦ లన్ని దెసల్నలరాఁకి కూసెడున్. 92

ఉ॥ గండుతనాన ఱేఁగితొలి ♦ గట్టును వెచ్చెరఁ జౌకళించి చే
గుండెఱు సోఁకు జింక తెగ ♦ నూడిచి గ్రిక్కున నాఁడు రాయఁడున్
మొండగు హత్తిగంటుచద ♦ లేనుఁగుఁజీల్చిన నల్లజాలునా
నుండెను సందెకారు నెఱి ♦ నూరుచునుండెడి మెఱ్ఱచాయలన్. 93

కం॥ చలిదాయరాకఁగోరియుఁ
దొలిదెస కెదురున్న యాస ♦ తొయ్యలితొగరుం
గల చీరెఁగట్టెనా యన
నలరారె న్సందెకారు ♦ నందెజడాలున్. 94

సీ॥ కస్తూరి రాచ్చొంటఁ ♦ గలయంగరుద్దిన
ఱెక్కలి మేనాధి ♦ తేజుదూరి

సిగయీఁకదారుల ♦ సొగసీఁక తోడుగుల
నందితిర్గాడు తా ♦ తయ్యఁ దెగడి
నీలికాల్ తెక్కల ♦ నెఱియంచలన్గాడి
జాల్గాను కాళింది ♦ చాయనణఁచి
చీఁకటిచెల్లల్ల ♦ సిస్తుగాఁదలనుండు
కాటుకకొండెచ్చుఁ ♦ గాకుఁజేసి

గీ॥ జుట్టుకొనె నీలికాకులఁ ♦ జుట్టుతెక్క
దారి గొంతులఁగోయిల ♦ దండ్లఁదెంట్ల
నీటిదారుల కెనయగు ♦ నిగ్గుజగ్గుఁ
గలుఁగు చీఁకటి చాలు జ ♦ గాలకెల్ల. 95

ఉ॥ నాఁడునఁదొజ్జిలందిగులు ♦ నాటిన చీఁకటి డాఁగిలేచి తి
ర్గాడిజగాలనిండఁగని ♦ కాఁక గలట్టిఁడుచేతులెంతయో
దాడిగఁ గల్లరీఁడులయి ♦ దానినిరాల్చఁగ నేగుదెంచె నా
నేఁడలత్రిల్లి కజ్జెలఁగ ♦ నెట్టిన యిక్కల నిండుజోతిఁగో. 96

గీ॥ లలిని రాత్తిరి యొడయఁడుఁ ♦ గలుగుకంటె
తొలిదెసనఁ దెల్లతెల్లగాఁ ♦ దోఁచెనిండు
మూలుఁదాల్చిన చలితల ♦ లీలఁగడఁకఁ
దెల్లనగునట్టుఁ గననయ్యె ♦ నెల్లరకును. 97

గీ॥ అవనుతోఁటనాయండు తొ ♦ లిదెసగుట్ట
చందుచెట్టుఁగల్గిన నెదు ♦ గొందనింగి

యేటిజాలులుఁదీసెనా ♦ యెల్లరకును
గొన్నిచేతులు నింగిఁ గ ♦ న్గొనఁగనయ్యె. 98

చం॥ కడలి యనుంగుకూన తెఱ ♦ గంటులతియ్యని తిండిచిక్క రా
యుఁడు చలికేల్గలాఁడు సిరి ♦ యన్నతొగాకెపు సంగడీఁడు రే
యొడయఁడు చండిజేని తల ♦ నుండెడు జాణఁడు కత్త్రిజేజెడా
కడకనుచందురుండు తొలి ♦ గట్టు తలన్గననయ్యె నయ్యెడన్. 99

సీ॥ తొలిదెస నెచ్చెలి ♦ తెలిననలొనఁగూర్చి
సిరసునఁదాల్చిన ♦ చెండనంగఁ
గనలికారెఱుక చీఁ ♦ కటి గూఁటిఁజెండాడఁ
గడఁకచేఁదాల్చిన ♦ కత్తియనఁగ
తెఱగంట్లుకూడెచ్చు ♦ తరుగులు లేకుండఁ
గోత్రెలెడు గురిజరా ♦ కోరయనఁగఁ
గఱిజేజెయడు గేటి ♦ తెఱగంటిరాకడ
యంచునఁ దిరుగు రా ♦ యంచయనఁగఁ

గీ॥ దొగలు హరుసించ దొంగలు ♦ దిగులుఁగాంచ
నంటుకాండ్రకు గిలిగుండె ♦ లగ్గలించఁ
జీఁకటే తెంచఁ గడలెంతొ ♦ చెంగలించ
నింపు నెలగల్గె రేయెండ ♦ నిండ దెసల. 100

గీ॥ అట్టి యానింపుచందురు ♦ నందుగురిసె
నెఱియిగానితొఁగాయు చం ♦ దిరికలు నెల

యెఱుకదారులు కుఱ్ఱల ♦ కిడెడి తెల్ల
యుగ్గునాగనునట్టేఁడు ♦ లోలినలఁత. 101

గీ॥ కటికిచీఁకటి రాసి యె ♦ క్కటి నడంచి
సరగ కడలందుఁ దెల్లని ♦ జగ్గుఁదీర్చి
గండుచందురు చందిరి ♦ కలుఁగడంగి
యెదుగగాఁజొచ్చె లోకుల ♦ యెదలుఁ జెలఁగ. 102

సీ॥ తిరిఁగియుఁ జదలేటి ♦ తరగల చందురా
సజ్జల చండిగా ♦ జడలనుండి
జారి గుండ్రిని జెక్క ♦ దారుల నలయించి
యెడసిన చెలియెద ♦ లడలనెంచి
కోడెకాండ్రిదగట్టి ♦ కొండలఁ దెగటార్చి
రోచ్చుచూలుల కడు ♦ గచ్చడంచి
నెలయూఁకదారుల ♦ నిండారఁ దనియించి
కడలిని సంతోస ♦ కారిఁజేసి

గీ॥ సరగ లోకుల డెందాలు ♦ సంతసానఁ
దేలఁగాఁజేసి కడలెల్లఁ ♦ దెల్లసుద్ద
నుగ్గుఁజల్లినయటు లెస్స ♦ నిగ్గుజోతిఁ
గలిఁగి రేయెండనిండుగాఁ ♦ గాయు తఱిని. 103

మ॥ సకినన్నాకగు రాచకూఁతురొక స ♦ జ్జ న్నేడెలగ్గూడి దాఁ
చక తాతయ్య గొనాల నుడ్గనెద ♦ నాసల్ నిండ నాలించి యా

సకియల్దాను సుకాననుండు తతి జా ♦ న్వాగుండు రేరాయుఁడా
రక చేతుల్ నెలరాల సజ్జకిటికీ ♦ క్రింతద్దగన్నించిరన్. 104

చం॥ గొరకలనూరి యొంటఁ దగ ♦ గుచ్చునటున్నిరికల్కియన్న చం
డిరికలుఁ దాఁకఁ గాఁకఁ గొని ♦ నెట్టన గుండెలుఁ దల్లడిల్ల నే
కరణిఁ దరింతు నిట్టి కడ ♦ గండ్లని తానన సెజ్జనుండి రే
దొరఁగని కన్నులారఁ గడుఁ ♦ దొందరతోఁ గసిఁదీర నిట్లనున్.

చం॥ కెరలుచుఁ దాఁచురాయఁడల ♦ క్రిందిజగానకు నీటుదిక్క రా
దొరగతి దార్లు నేలకల ♦ దొడ్డలునౌ తెఱగంట్లు నింగికిన్
గరకరికారి యీతిగ జ ♦ గాలకుఁగంటుగనుంటనీయొడల్
కరకరలాడఁ గోసితిన ♦ కద్దగనుందురె చుక్కరాయఁడా. 106

ఉ॥ చల్లని తేఁడటంచు నిను ♦ సాదులనద్దగనాలకించితిన్
జల్లదనానిఁ గానమెఁ ♦ జానలొడళ్ళను గిత్తుతున్నలన్
జల్లినయట్లు నీకుఁగల ♦ చాయలఁ జల్లి నెఱింత యేడ్చఁగాఁ
దెల్లఁగఁ జేసితింకనినుఁ ♦ దిన్నని తేఁడననౌనె రేదొరా. 107

సీ॥ తోడఁ గల్గినదని ♦ చూడక దానిల్లుఁ
జిటుకునఁ గూల్చినఁ ♦ గటికిసూఁడ
కలిఁగినతోడనే ♦ కన్నయ్యడొక్క నీ
రెగరఁ జల్లించిన ♦ యీసుకాఁడ
కనికరానిని లేక ♦ కన్నకుజ్జనితోడఁ
గంటుతనానుండు ♦ గొంటుకాఁడ

ఒంటరై తలఁజూచి ♦ ఒజ్జసానిని జతఁ
గలసి తిర్గాడిన ♦ కన్నగాఁడ
గీ॥ యిట్టి కర్జాలుఁగలిఁగిన ♦ యట్టినిన్ను
రేయిఁ దిరుఁగాఁడు నితఁడని ♦ ఱాయిఁగుర్తి
నుడుఁగకల చలిచేతుల ♦ నోడయుఁడందు
కౌర యీ జోలి నాలించ ♦ నౌనెచందు. 108

కం॥ ఈలీల కడలి కుఱ్ఱని
గోలగఁ జేడియడిసంతుఁ ♦ గొట్టుచునుండన్
గాలియయుటుఁ దాఁకిచూర్చిన
గాలియటంచెడఁదఁ దలఁచి ♦ గడగడలాడెన్. 109

గీ॥ దండి నింగినిఁగల్గి గం ♦ దానికొండ
నేచిగందానిఁజేకొని ♦ యేగుఁదెంచి
యెడసినట్టిఁడు దెందాల ♦ నుడుకఁజేసి
యెల్ల నెన రెగఁజల్లి యా ♦ చల్లగాలి. 110

గీ॥ చెలఁగి చనుఁదెంచు గాలి కూ ♦ నలకు జడిసి
నెలఁత కన్నాకు దెందానఁ ♦ దోలకరించుఁ
దల్లడకు సెజ్జయందున ♦ డొల్లిడొల్లి
లేచి కూర్చుండి యిట్లను ♦ దాఁచకుండ. 111

గీ॥ గాలి నాయెదఁజెట్టునఁ ♦ గలుఁగులాఁగు
నందు నెడసిన యెరగలి ♦ క్రిందుకొనఁగఁ

జేయనే తెంచునటులాయె ♦ నోయి నీదు
రాకఁ గనులారఁ జూడఁగ ♦ తాఁగనేను. 112

చం॥ అడరెడు చల్లగాలితగు ♦ నాసిరియన్ననుఁగూడి నాయులర్
యెడసిన దండ్లనేర్చి సెగ ♦ కేన్నజతౌచు జగాలఁగాల్చి సి
గడుసెడఁజేయకుంటియదిఁ ♦ గాంచిన టొంకుతనానఁగూళ్ళ నోం
డొడసి జగానఁగూలు నెజె ♦ నోండ్లకుఁ జేటొనఁగూడఁజేసినర్.

సీ॥ సారెసారెకు నిన్ను ♦ నోరూర నగ్గింతు
సాఁకరాదాననుఁ ♦ జల్లగాలి
తలఁచిచూడఁగఁ జిన్న ♦ దానను నెనరుంచి
యల్లనఁ జనుఁదెంచు ♦ చల్లగాలి
యడ్డొరుఁగానక ♦ దొడ్డగానేచెదు
సందియానినిలేక ♦ చల్లగాలి
యెడపిన తెగల చి ♦ చ్చుడికించనీకిది
చెల్లని కర్జాని ♦ చల్లగాలి

గీ॥ కత్తి నెచ్చెలికొమకిదే ♦ కదలియనికి
రాగలండని నాకడ ♦ కేగుఁదెంచి
నుమఁగఁగోరిన లెంకయం ♦ చెడఁదలోన
నేఁడుఁ దోచెనుగదరోరి ♦ నింగిచూలి. 114

గీ॥ ఇట్లు చెన్నగునన్న రే ♦ యెండగాయ
నిండుకాఁకల కడలొంది ♦ నింగిచూలిఁ

దిట్టుచట్టిరుచేగాసిఁ ♦ దొట్టియుండి
జాలిఁగొనుచుండెనార త ♦ టాలునంత. 115

ఉ॥ లచ్చినిసుంగుచిల్కతెగ ♦ లాయుచుఁగూయఁగ నేగుఁదెంచి కా
ర్చిచ్చుకు సాటియౌ యలరుఁ ♦ జిల్కలసింగిణిఁగూర్చి కచ్చెతోఁ
గ్రిచ్చర తీఁగెటెండ్లదరిఁ ♦ గ్రాలెడిచాటున డాఁగి చన్నులన్
గుచ్చఁదొడంగెఁ దేంట్లతెగఁ ♦ గుట్టునటులక్కడగాసిఁజెందఁగన్.

గీ॥ సల్లగుండెలు జలుజల్లు ♦ జల్లనంగ
గడగడాయంచు లేచి తా ♦ గట్టిఁదొలఁగి
చెల్లనో తల్లియని నన ♦ సెజ్జయందుఁ
గాలునిలలేక గ్రిక్కునఁ ♦ దూలిపోలె. 117

ఉ॥ అంత నెలంతతోడి చెలు ♦ లాతురతన్జని డాసిచూచి గో
రంత దిటానిలేక యక ♦ టాకడుఁగాఁకల నేలరాలె నీ
యింతిని నేఁడదేర్చుటకు ♦ నేది తెఱంగని చల్లదిన్నులన్
జెంతల సంతలన్దిరిఁగి ♦ చెచ్చెరఁదెచ్చిరి చేడె లందఱున్. 118

సీ॥ కులుకుచేడియ తెగ ♦ గొజ్జఁగిననీటఁ
గాలుసేతులు తలఁ ♦ గలయఁగడిఁగి
చక్కనిగందాని ♦ చలిమిసుకతునక
లారసి మొడలనిం ♦ డారనలఁది
కెందొగయలరులు ♦ గేదఁగిననతేకు
లెడరు సెజ్జననలుఁ ♦ గడలఁజల్లి

నింగి చూల్గందాని ♦ నెఱిఁగొని యేతెంచు
గాలిఁగొట్టఁగ సుర ♦ టీల నూఁచి
చెన్నుఁ దనరారుఁ దిన్నని ♦ కిన్నెరరొదఁ
గలసి కురిసెడు తియ్యని ♦ గాణతేనె
జానుఁగులలాఁగులందునఁ ♦ జక్కనించు
సేదఁదేర్చిరి కొద్దిగాఁ ♦ జేసెలంత. 119

గీ॥ కొలఁదికారున యాసేదఁ ♦ దొలఁగికదలి
తిక్కఁగొనునట్లు నోటి కెం ♦ దెరలుఁగండఁ
గాఁక నూర్చుచు నఱయఱ ♦ కనులుఁ దెరచి
యొయ్యనొకదెస సెజ్జన ♦ నొత్తిగిల్లె. 120

కం॥ ఒడలుక్కనీరుఁగారఁగఁ
దడికన్నడలేక నెగులుఁ ♦ దాఁకినవెదతోఁ
గడుడగ్గుత్తిక యెలుఁగునఁ
దడయక నెచ్చెలినిఁజూచి ♦ తా నిట్లనియెన్. 121

చం॥ ననచిగురాకుఁ జిల్కు లెద ♦ నాటిన జోటినలంగిత్రిగ్గ దే
గనతగఁగాయు చందిరిక ♦ కాఁకకు జోకకుఁ దల్లడించితిన్
దిననతేనెగండులగుఁ ♦ దేఁటులతోటుల రద్దికాగనేఁ
గనుఁగొననేగుఁదెంచుఁ జలి ♦ గాలికి నాలికిఁ దాళజాలనే. 122

సీ॥ చక్కని యెదమాలి ♦ చిక్కని చిల్కుచు
రక్కున నెడదెంతొ ♦ చొక్కనేయ

నజులేక చల్లఁగా ♦ దారయుఁ జేతులుఁ గల
దారనిండు కాఁక చం ♦ దిరికఁ గాయఁ
గనలక ననపాన ♦ పాదఁదీరఁగాఁ గ్రోవి
కడసి తేఁటుల తెగ ♦ రొదలు సేయఁ
గలకిలఁ బాడు చి ♦ ల్కలతోడ జతఁగూడి
కలతఁ జెందంగఁ గో ♦ యిలలుఁ గూయ
గాసిచేకూరె నీటిజా ♦ ల్కనులజారె
దిగులెక్కఁడఁ జేరె గట్టియెం ♦ తేనిఁ జేరెఁ
దీవికెత్తు తనయ కే ♦ దెసకుఁ జొత్తు
సైచనోతల్లి నన్నేలు ♦ చానతల్లి. 123

మ॥ అరయ న్జిల్కలలచ్చి దొడ్డదార యె ♦ య్యారానిఁ జేచేగయుఁ
నెఱికేత్రిద్గు సోయగాని కులుకు ♦ న్నీటుఁ జగానుద్గన
త్రాఁకి నాయెద్దఁ జిగిర్చెఁ జక్కనయకు ♦ ద్గంపొన్నటంచెంచి నా
దారగాఁ గొఁదితి నిచ్చ నచ్చియిఁక నే ♦ దో తెన్ను నద్గంగదే 124

మానినీవృత్తము.

అరయ లచ్చి దారంగగుఁ గొట్టిక ♦ కాదటఁ జల్కలఁదొందరగాఁ
జేరి సిరిన్గొనుతేనినిఁ దోడ్కొని ♦ చేరఁగరాదది యెందులకో
సాకెకు దారులుఁ జూచుచునుంటిని ♦ సంకుఁగలాఁడొక చక్కనియె
య్యారికి లోనయిరానసిచిల్కన ♦ హా యెటుఁదోలెనొ తోచదుగా.

సీ॥ చిలుకలకొల్కి యా ♦ చిలుకసురుసురయి
యలసటదాఁకిన ♦ నిలచెనొక్క

సిరి జేని యూరికి ♦ సరిఁగియూ దొరజాడఁ
గన్నులఁ గానకెం ♦ దున్న దొక్కొ
నాలగనానికి ♦ నోలిరండని తఱి
కొండదారిని నెన్ను ♦ చుండెనొక్కొ
రాకాసి గొంగిటు ♦ రాఁజూడఁ జేడియ
లదిఁగూడదని తగా ♦ దాడెనొక్కొ

యట్లుఁగాకున్న లచ్చినా ♦ యంతు నెనరుఁ
గలుఁగు డెందానితోఁ జల్లుఁ ♦ గలసిరాగఁ
దలఁచియున్నాఁడొకో యేదిఁ ♦ దెలియకిటుల
సందియానినిఁ గల్గెనే ♦ చాననేఁడు. 126

శా॥ ఆలించంగదె నల్లనయ్య యెద నా ♦ యందుంచి టాటోటు డెం
దాలుంగల్గిన నల్లఁదాగ్రిగుడుల దం ♦ డ్లన్నెరి నుగ్గాడఁగా
నోలాకింతయు లేని దిట్టయిటురా ♦ నున్నాఁడో యిల్లాలు నా
కేలా లెక్కకు నెక్కుడుండిరని తా ♦ నే తెంచఁడో నెచ్చెలీ. 127

గీ॥ కత్తినెచ్చెలి యిటకురాఁ ♦ గలఁడొ రాఁడొ
యనుచు దిగులొంది చెలితోడఁ ♦ దనదు కస్తిఁ
దెలియఁ జేయఁగ నత్తఱి ♦ నలరు చిల్లు
దారి గుఱిజూచి కోలలుఁ ♦ దాఁక నేసె. 128

శా॥ ఏరా లచ్చి యనుంగుకూన తగునా ♦ యీలాటి నీచేఁతలుౕ
దారి న్దొంకెలుగంగ లే కెడయుఁజా ♦ నన్నన్ను గోడాడఁగా

కేరాయు సజ్జతఁగూడి తేఁటితెగనా ♦ రిజ్జిలుజ్జలనేర్చి యా
రౌరా యేచెదుజాలు నీకఱుకు చ ♦ య్యెంచెన్నికన్గాంచితే. 129

కం॥ ఆలించరనానుడిఁగసిఁ
జాలించర లచ్చిజేసి ♦ సరగున నిటకుఁ
దోలించర కన్నెను నను
లాలించర జోతఁజేతు ♦ లలిసిరి కూనా. 130

సీ। కుత్తుకలోఁజేదు ♦ తిత్తిగాదిదిఁజూడ
టీకైన కస్తూరి ♦ రేకగాని
చవలు క్రీల్గంటుఁగా ♦ దిదినీలిరాడాలు
జతయైన నెఱికల ♦ జడయెకాని
సౌరఁది యొంటనఁదెల్ల ♦ సున్నిగాదిది చలి
యిసుకగందాని రో ♦ చ్చసలుఁగాని
సిరసున చందురుం ♦ డపయుంగఁ గాఁడిది
తెలి లచ్చి చెలియింటి ♦ యలరుఁగాని

యెఱుఁగకిటు నీకు గొంగ యీ ♦ సరునిలీల
నన్నుఁగనుఁగొని కసిఁదీర ♦ నెన్నియేని
చిలుకులేయుచు నుంటియో ♦ సిరినిసుంగ
సరగఁగై చేసుకున్న ల ♦ చ్చనను నేను. 131

చం॥ కరకఱి నన్ను నేఁచ యలు ♦ కా యులుకా నిలు కాఁకకోర్చరా
యఱనన చిల్కులేయు నగు ♦ నా తగునా యెగునా నదాననీ

యరినెఱి నెక్కుడించుచెడుఁ ♦ గాచిడుఁగా నుమఁ గాలకించుసూ
కొఱకొఱలాడు కోయిలల ♦ కుద్దలకున్నలుకు న్నలంగతిఁ. 132

సీ॥ కలుఁకైన నీచేతి ♦ చెఱుకు సింగాణి జ
గాలిఁదుండెతుం ♦ డేలుఁగాఁగఁ
గెరలుచుండెడు నీదు ♦ నెఱిడాలు చిచ్చెంతో
కలుఁగింటి లోలోనఁ ♦ గలయుఁగాఁగఁ
జేడెల నగచాట్లుఁ ♦ జెందించు నీనిగ్గు
చిలుకులు నీటిలోఁ ♦ జేరుఁగాఁగఁ
గిలకిలలాడుచుఁ ♦ జెలరేగు నీదంష్ట్లు
గట్టిగాఁ జెట్లలోఁ ♦ గలయుఁగాఁగ

నోలినీయొడ లగ్గిలోఁ ♦ గాలుఁగాఁగ
దేమకవుగండు త్రాఁచుల ♦ తిండిఁగాఁగఁ
జూచి కసిఁదీర్చుకోనఁగన ♦ న్నేఁచనేల
హెచ్చి నాచెంతరాకుర ♦ లచ్చికూన. 133

మత్తకోకిల.

చందురుండల నెత్తినజ్జనఁ ♦ జక్కఁగా నిరుచక్కి గో
లొందఁ జిల్కలుఁ దేంట్లుఁ గోయిల ♦ లోలిరంతులుఁ జేయనా
గందికుందఁగఁ జేయరాకుర ♦ కత్తినెచ్చెలి కుజ్జఁడా
యొందుకీ కసి కుజ్జుదానను ♦ హెచ్చునెనరునఁ జూడరా. 134

సీ॥ కాలూనఁజాలక ♦ గాలికన్నుయఁ జేరి
టాటోటు రొదఁ జేతు ♦ తోటి తేఁటి
చక్కనయ్యకు లెస్స ♦ జక్కినినేసని
కిలకిలాడకు సిగ్గుఁ ♦ దొలుకఁజిలుక
సొరది నాయొడలున ♦ సోఁకి గోడాడించఁ
దొడరకు కడుజాలిఁ ♦ దూలి గాలి
జానుఁగు లదరఁగాఁ ♦ గోనచెట్టులరంతు
జేయకు నీనాల్కఁ ♦ జీరగోరఁ

జేరె యీరలు చేగెడఁ ♦ జేయఁగోరి
చెడుఁగు చెందాని చూలితోఁ ♦ గడఁకఁ జేరె
నేఁడు నాయెదలో నిండు ♦ నెగులుఁగలుఁగఁ
జేయరాకండి లగ్గులుఁ ♦ జెందరండి. 135

చం॥ తడయకఁ దేఁటిచిల్క సిగ ♦ దారి తెగల్దగి కూఁతలేయ రే
యొడయఁడు నిండుచందిరిక ♦ లోడక కాయఁగఁ జల్లగాలి నా
యొడలికిఁ దాఁకి కాల్చ నయ ♦ యోసిరికుఱ్ఱఁడు డాకఁ జేసె నే
నెడకరు దెంతు నేఁడు తెఱఁ ♦ గేది చెలీయని నుగ్గునంతలోఁ. 136

సీ॥ ఆలు కుఱ్ఱలంతోడ ♦ నడలికుప్రిం కేడు కొండ
కరుఁగు చందురు దండు ♦ దొరయనంగఁ
దెగఁదోలిఁ జనుఁ దెంచుఁ ♦ దొగచెలి జోడు జెం
డానుండు నిగ్గుట ♦ ద్దానియనఁగఁ

నొద్దురా యెదుటి జా ♦ న్రిద్దులగనతతి
జగసాంకికుండూఁదు ♦ సంకనంగ
నటఁ జలిదాయ తా ♦ తౌటనెక్కుటకునై
నచ్చి తెచ్చిన యంచ ♦ నాయఁడనఁగ

రేఁగి తొలికొండఁ జెట్లలో ♦ డాఁగి గొంగ
జాడలన్గని సాగిరా ♦ చాయతేఁడుఁ
దనదు చేతాళ్ళఁ గట్టనై ♦ తనకుఁదోడి
సంచుచుక్కలఁ దోల నే ♦ తెంచెననఁగ
సొరఁడిఁ దొలిదెస సుక్కురు ♦ చుక్కఁదోఁచె. 137

ఉ॥ జోడనిజూడకొద్దుదొర ♦ జోటియనేసిరిగద్దెచాన నే
నేమచునట్లుఁ జేసితిని ♦ యీసునఁ దానిఁక నేగుఁదెంచుచు
న్నాఁడని క్రుంకుటేర్ల దొర ♦ నట్టునఁ గ్రుంకెను జందురుండుతాఁ
గీడొనరించి నెచ్చెలినిఁ ♦ గేరుచుఁ జూడఁగ నిచ్చగించునే. 138

సీ॥ చుక్కలడాలూడి ♦ యొక్కటొక్కటిజారె
దొంగల లంజెల ♦ తొందరారె
సుడిగ్రుడ్డు చూలుల ♦ యుడుకులుఁ జల్లారెఁ
దినఱెక్కదారులు ♦ దెసలుఁజేరె
సిరిగద్దియలదేనె ♦ తరుచుగా నిండారెఁ
గోడికూఁతలు జాను ♦ **గు**లను దూరె
నెడసిన తెగలకుఁ ♦ గడగండ్లుఁ దెగటారె
నెలయీఁకదార్లకుఁ ♦ గలఁతలూరెఁ

జక్కఁగా నెడ్దచూలిక ♦ ర్జానిఁదీరెఁ
దిక్లికలఁ దెల్లనైనట్టి ♦ తేజుకూరెఁ
నెగులుఁ దోగకన్నె కడరి క ♦ న్నీరుఁగారె
లలిని సేద్దెకొండ్రొద్దురాఁ ♦ గలుఁగఁగోరె. 139

మ॥ ననుఁగాదంచెద నేఁటిరాతిరొక చా ♦ నన్గూడ నద్దాని జాణ్
జనులన్గోరె యలందుకున్న నెఱిగా ♦ దానికుఁ దాఁ కెన్గదా
యనుచు న్దొల్దెస జోటిజాన్దలను చీ ♦ యంచు న్గసిన్దాల్చెనో
యనఁగాఁ దొల్దెసఁ గానయ్యెఁ దగ నా ♦ హోసందె కెంజాయలుణ్.

సీ॥ అలరుఁ జాయనెలంత ♦ కనుఁగు, నెచ్చెలికాఁడు
నలసిరిగద్దెకు ♦ నంటుకాఁడుఁ
జక్కుఁజీఁకటితెట్టుఁ ♦ దుక్కుఁజేయఁగలాఁడుఁ
గడగండ్లనెంచు ని ♦ గానిసూఁడు
నెలయీఁకదార్లకుఁ ♦ దొలఁగని యురిత్రాఁడు
చలిచేతులుండేడు ♦ చందుజోడు
యెల్లనాఁడుల రక్కు ♦ సీఁడులఁ దూఁటాడు
చెడుగు దొంగలకెంతో ♦ జేయుఁ గీఁడు

మెంచి తొగతెగలకుఁ గలిఁ ♦ గించు గోడు
నట్టి తెఱగంటితిగ జగా ♦ లందులేఁడు
లలినిఁ జెన్నొందుఁ దొలికొండ ♦ తలననేఁడు
నోలిఁ దోచెను గనుఁగొన ♦ నొద్దు తేఁడు. 141

చం॥ తొలిదెసతేని జక్కరన • దొడ్డతొగ త్రెగలాచునుండఁగాఁ
జెలియగు చందురుం డెడయఁ • జేనలంచెడికాఁకయగ్గి చా
యలుననఁ దొల్లిగుట్ట సిగ • యందు నెలర్చఁగ లోకులెల్లఁ దాఁ
గలయఁగఁ జూడనయ్యె సిరి • గద్దెదొరెన్నఁగ నెజ్జిజోతితోఁ. 142

గీ॥ అంతటలయెండ దెసలెల్ల • నల్లికొనుచుఁ
గాయుచుండె నటంచని • కడఁకఁ జిలుక
జోగిరాయఁడు జేజె రా • చూలికొడుకు
కొడుకుతో నెనరూనఁగా • నుడుఁగసాగె. 143

## — ఆశ్వాసాంతము. —

వనమయూరము॥ గడుసులనడఁచిన • గనతరతుట్టా
కడునెలసరి తలఁ • గలిఁగిన దిట్టా
గుడుసు చిలుకుకయిఁ • గొనఁదగునట్టా
చెడనరికిన కఱి • చెడుఁగుల తెట్టా. 144



## గద్య:

సీ॥ ఇదినాఁడు కేలుని ◆ న్నెదలోనఁ దలఁచుడిం। గరుఁడసాదులకు సం ◆
గాతికాఁడ । సొగసుసంతునఁగల్గి ◆ జంటితేనియలూరు । నలుఁ
దెజంగులఁ గ్రైత ◆ నాఁణెగాఁడ । రహింని కోరాడక్క ◆
రానికి నేత్రుండి। కుడితట్టుసున్నతో ◆ ల్త్రడరుకయ్యా।
యను నేనునారాణి ◆ కన్నసజ్జిరిన। యటుల
లోకులుఁజీర ◆ లలరు నతఁడు ।
తోడుఁగలుఁగఁగనదరాల ◆
దుగఁదగలని। నుడులతో
నచ్చు తెల్గునఁ ◆ జెడక
యుండు। కయిత నోన
రించితినియట్టి ◆ కత్త
కుఁదిగక। తయ్యో
నరించితి సిరి
దోర ◆ తరు
గు లేక.







శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

శ్రీ

# శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన లక్షణా పరిణయము.

## చతుర్థాశ్వాసము.

కం॥ గనతగొనా త్తగనట్టా
చినిరుసిసంచులను సాద ♦ జేజే చెట్టా
యెనలేని యుక్కుగుట్టా
కొనసాగెడు కుంక్లకుంట ♦ కొట్టికదిట్టా. 1

గీ॥ ఆలకించఁగ దేయని ♦ నేలదొరకుఁ
జిలుక జడదారి యిట్లనుఁ ♦ జెలఁగినింగి
కెక్కి రేదొరజోడేగ ♦ గ్రిక్కునచట
సిరిదొరూరికిఁ జేరిరా ♦ చిలుక చెలియ. 2

శా॥ కొన్నాళ్ళు న్నిరితేని దొడ్డచెలిచేఁ ♦ గూర్చించి సాకంగ జా
జెన్నారున్ననతోఁటనుండి యట నెం ♦ తేఁ జీలితాత్రయ్యఁ దాఁ
గన్నారంగన నేగి కారుఁగని లో ♦ గా సంతసాన్దేలి యా
కన్నాకొ నెలరాల సజ్జగదిలో ♦ గాఁ జెన్నుఁగ్రొల్చుండఁగ. 3

గీ॥ గోలలిరుచక్కిఁ గడు సుర ♦ టీలనూఁచ
నేదినుడ్గునొయని లెంక ♦ లెదురుఁజూడఁ

గడఁగి నొడ్డోలగాని రా ♦ గద్దెయందు
జేజెరాలిలఁ గూర్చుండు ♦ సిరియొడయని. 4

చం॥ కనుఁగొని యెడ్డ సంతసిలఁ ♦ గా సిరిరాయని కాళ్ళనంటి యొ
య్యనఁగొనియాడ నొంటరిగ ♦ నాగనుఁజుండఁడుజయ్యాయాట యం
చని చిలుకల్లసత్తుచెలి ♦ యాదటనేలెడి చిల్కనేస్తిఁదా
నొనరిఁచి కొన్నినాఁడులకు ♦ నోలిగఁదాతయచెంతఁజేరియున్. 5

గీ॥ కదసి యా చక్కనయతండ్రి ♦ గారియొక్క
సొగసుకాల్దోయి క్రొత్త కెం ♦ జిగురులందు
నల్లనల్లన దూఁకి జో ♦ హారుఁజేసెఁ
దనదు తుండాని కెరడాలుఁ ♦ జెనకుచుండ. 6

కం॥ కడు సిరసుకాలులంటఁగ
నిడుదగు నరుసానఁ గనుల ♦ నీరొలుకఁగ నె
క్కుడు సంతసానఁ దేలుచు
నడుగెత్తక లచ్చిజేని ♦ నటఁగొనియాడెన్. 7

ఖడ్గబంధములు.

కం॥ లలితలితలియెదజేఁడా
నెలదారికి సంగడీఁడ ♦ నెఱికఱితోడా
తులకించుచేగకాఁడా
తెలికేతిఁ గలాఁడ యెఱచి ♦ దిండ్లకుసూడా. 8

సుగంధి॥ జోడసాదరాద నీకు ♦ జోడుజేఁడు లేఁడుగా
గాడిలిన్జగాలనెల్లఁ ♦ గాచు కృష్ణ లచ్చి రా
రాము ని గొనాల సన్ని ♦ త్రాఁచుతేని కెన్నఁగా
గాడిలూని నా యెడందఁ ♦ గల్గు కోర్కులీయరా. 9

## మాలికాబంధము.

చం॥ నెలఁతల నోలలాడు నిను ♦ నిచ్చనిగా కయిదోయిహాయిగాఁ
వలతల బాలఁజేర్చి తలి ♦ తల్లితలంచెడ జేఁడయీడనా
కలఁతలఁగూలఁదోఁయఁగడు ♦ గట్టిగఁ గొల్చెద సాదరాదయో
సిలుగులుఁ దోలుకృష్ణ జగి ♦ జయ్యు జగిల్దగఁ జేగనీగదే. 10

గీ॥ సరగనిటుఁ జల్కు చక్కెర ♦ సాటియైన
తీయనైనట్టి నుడులతోఁ ♦ దీపుతీరుఁ
గాకఁగొనియాడసత్తు సం ♦ గాతకాఁడు
జక్కఁగానున్నదని యెద ♦ సంతసించె. 11

కం॥ ఇటుఁగొనియాడెడు చిలుక
ద్దటకునఁగని నల్లనయ్య ♦ తనరెడి నెనరూ
రుట నీటిదారి రోదఁ జ
క్కటి నుడులాడంగఁదొడఁగె ♦ గాదిలి యెదతో. 12

కం॥ ఏనాడే కొట్టికనెత్తి
యానాడే యెడయఁడేలు ♦ నలరుచుఁజిలుకా

యీనాఁడిట కరుదెంచిన
జానగుఁగతిఁ దెలియఁజేయు ♦ జానుఁగు లలరన్. 13

సీ॥ అలించు జానుఁగు ♦ లార నానుడుఁగులు
గొల్లకన్నెలనేలు ♦ కోడెకాఁడ
నోటితెరల్ రెంపు ♦ నాట్యశాలారు
రహినందున్నై దక్ష ♦ రానితోలుత
నుండుదగ్రినాడు న ♦ దండిజేజేరాయఁ
డేలుకోట్టికసారుఁ ♦ గాలఁదన్నఁ
కడఁగిన రతనాని ♦ గుడిసన్నకోట్టిక
తేఁడిక్కఁగలదద్ది ♦ రూఁడిగాను

నేలుదొడ్డ దండుఁడనెడి ♦ నేలదారి
కడుసుకొనను గనఁదెలి ♦ గంట్లతేఁడు
యెడరులోఁతుగొనాలకుఁ ♦ గడలితేఁడు
లలిని రాసంతురేతేఁడు ♦ లచ్చితేఁడ. 14

గీ॥ అతఁడు జోగులసాఁకుట ♦ యందుజేజె
తొడుకుఁ తన డొక్కలో సంతుఁ ♦ దొడరకున్న
కలనుదినుజోగి యానతిఁ ♦ దలనుఁజేర్చి
నన్నుసాఁకిన సంతల ♦ నాఁడుఁగలిఁగె. 15

కం॥ అలజడ్డు కడలికిన్సిరి
నెలఁతుక తగఁగలిఁగినట్లు ♦ నెటియా దొరకున్

గలిఁగెఁగడసారి కూఁతురు
లలిలగ్గులరాసియూర ♦ లచ్చనఁగంటే. 16

గీ॥ తాతనేలను జక్కని ♦ జోతినీట
సొరఁడి చదలేటి యసలుచూల్ ♦ సున్నినించి
నాఁడు దొరసానఁ దలగట్ల ♦ నఱుకుతాతఁ
గలయఁగా నూరిచేసెనా ♦ కలికిదనరె. 17

సీ॥ తొగరాయఁగిరాయ ♦ నగురాయటంచును
నెలఁత చక్కఁదనాల ♦ నెత్తితీరు
నెఱి నీటిదారుల ♦ దరిదారులంటక
నురికించుఁ జేడియ ♦ నెఱులసొరు
దండికొండలగట్టి ♦ గండడగించంగఁ
జానలతలకట్టు ♦ చనులుఁగోరు
నడుసు చూలులఁగడు ♦ గడుసుచేనడఁచుచుఁ
గాఁగ్లింటి సొగలా ♦ కనులుదూరు

జోటి నుడుఁగులు తియ్యని ♦ జున్నులూరు
గరిత చిరునగు నిండు చం ♦ దిరికఁగేరు
కలికినడ లంచ తెగనట్టె ♦ కలనజీరు
నేడఁజూచినఁ గనరాదు ♦ చేడెసొరు. 18

గీ॥ నెలఁత నెఱిజడఁ దూలించు ♦ నేలదాకి
నేలదారులఁ జనుదోయి ♦ యేలితీరు

తీరునగు కాన్కనుర్గులఁ ♦ జేరియడుగు
నడుగడను చూలిచక్కన ♦ నడుగుఁజేర్చు. 19

ఉ॥ చక్కనిలచ్చికూన యొఱ ♦ సాననఁదీరినకత్తి యెన్నఁగాఁ
జక్కని లెక్కలేని నెఱి ♦ సాదుగొనా లలరారు తిత్తిజాన్.
రిక్కలరాయ నిన్నెగడి ♦ రెక్కనుతిన్నని నెత్తియెంతయో
చిక్కనియొంటినున్న నని ♦ సీయనుసూనన గుత్తిచానకున్. 20

చం॥ కడుసిరి దానియింటికగుఁ ♦ గంటులగెల్చును జేడెకన్ను లె
క్కుడు తలనారు జోతులెస ♦ గున్నెఱితూఁడును దానికెంతయో
గడుసగు గొంగలన్నెగడు ♦ గట్టిగనెల్తుక కేలుదోయిజాన్
నడకలు నీలిడాల్కురులు ♦ నాకగునాగొనియాడలచ్చిరా. 21

ఉ॥ ఎన్నఁగనయ్యొయారియొడ ♦ లెల్లఁగడానినిఁ గేరుచేరలన్
గన్నులుదూరు నీలినెఱ ♦ కల్లఱె తేఁటుల తీరునెత్తియున్
గ్రొన్నెలసారుచన్నుజత ♦ కొండలగట్టి యడంచఁగోరునా
కన్నియచెంతఁ జేరినను ♦ గాంచెదుచక్కదనాలనన్నిఁటిన్. 22

కం॥ సొగసుతలనిండు తొగ రా
నగురాచెలి నోటితెరల ♦ నన్గ్రొంజిగురా
కగురానెఱకలు తేఁటుల
తెగరానూగూరు త్రాఁచు ♦ తీరనఁదగురా. 23

సీ॥ ఒడలు తళతళడాలుఁ ♦ దొడపుచుండుట నీటి
దారియందునఁగల ♦ తళుకటుండ్రుఁ

గసుపు తెగదాయు రాదగు
నుడులాలించెడఁదలోన ♦ నుక్కటలేకన్. 27

సీ॥ తరిగట్టుదాటి నా ♦ తండ్రియీడేరిన
ననుఁగనిచోరయం ♦ త్రానిఁగూర్చి
దిట్టఁడై యేతేఁచు ♦ దీనిరాల్చిన యాత
గానికినేఁగన్న ♦ కూననిచ్చి
లగ్గులుఁగలలెస్స ♦ లగ్గానిఁజేసెద
ననికట్టుఁజేసి తా ♦ గనతగాను
నాయిచ్చఁగలజేని ♦ కేయిత్తుననిజాటెఁ
గడలతోండ్లందఱుఁ ♦ గదలిరాఁగ

నీకుఁదెలిసినదేమైన ♦ నీయడుగుల
కెఱఁగి గొనియాడుచుంటిని ♦ సిరియొడయఁడ
కనుకనానుడు లాలించి ♦ కనికరించి
యేగుదెంచియు ననుఁగొని ♦ యేగుతేఁడ. 28

కం॥ సిరితేఁడ నేనునిచ్చలుఁ
దరుఁగని డింగరితనానఁ ♦ దలఁచుచునుందున్
నెఱితాలి యఱుతగట్టుచు
నఱకాలన్గాలుఁద్రొక్కు ♦ దంచెదలోన్. 29

గీ॥ ఎక్కుడగు దండుతోఁగూడి ♦ యేగుఁదెంచి
చోరయంత్రానిఁ దెగటార్చి ♦ సూఁడుతేఁచు

తెగలనుగ్గాడి లగ్గ లెం ♦ తేనిఁగలుఁగ
నన్నులగనానిఁజేసి కో ♦ నల్లనయ్య. 30

సీ॥ నీకొమ్మలనుబెంగి ♦ నేలచూలునఁ దిరుఁ
గుడు నందఁగోరు నా ♦ యొడలితీఁగ
నీతలచందు చం ♦ దిరికలుఁగోరిల నా
కనునెలయీఁక దా ♦ ల్గొనరఁగోరు
నీయెదనాటాడ ♦ నాయెదమూల్గోయి
సుడిగుర్దుచూలులు ♦ జోకఁగేరు
నీనోటికెక్కిఁదెర ♦ నెఱిఁజగురంటుట
కైగోరు నాకోర ♦ తీఁగెకోనలు

నీయడుగడుసు చూలుల ♦ హాయినుండఁ
గోరునాయెద తేఁటి యే ♦ కారునైనఁ
గానియానుడు లోరులనుఁ ♦ గనుటకిచ్చఁ
గోరకుండును గొల్లెత ♦ గోటుకాఁడ. 31

ఉ॥ చక్కనిజేఁడటంచు నెఱ ♦ జాణఁడటంచొగి జోగితెండ్లకే
జక్కఁడటంచు సోఁకుఁడులఁ ♦ జీల్చుటసత్తిఁగలాఁడటంచు నా
కొక్కట నెందరోనుడుఁగ ♦ నూకొనిజానుఁగు లాలకించి నా
దిక్కని నిన్నునచ్చితిఁగ ♦ దే ననుఁజేకొను సత్తురాయఁడా. 32

ఉ॥ జోగులదండ్లు నిన్నెదల ♦ సూటిగఁగన్గొన సత్తిలేక తా
రాగిరి యట్టియీరరిది ♦ యూ నొకచేడియ డొక్కఁగల్గి యీ

లాగు గొనాలనూని తిల ♦ లంఘులఁజెందితి గాన యీరతే
లాగునన్నైనఁ దొందరగ ♦ లాచుచు నిందుల రాగదేహొరా. 33

ఉ॥ నాసయు లేకనిన్నుఁ జిన ♦ నాఁడెగనుంగొని రాఁపు దెఱ్ఱ- సిం
గాణిఁ గలానియాట నెఱి ♦ గండఁడటంచనె ♦ గొల్లకన్నెలున్
జాణఁడటంచుఁ గూడి రసు ♦ సానొగి గిట్టదికౌగలించి తో
సానవెలర్చె నాసకుల ♦ సాటిగనన్గొని నాదరాపొరా. 34

కం॥ ఈలాటినుడులిఁ కేలా
గోలను నాయట్టిదాని ♦ కోరికఁ దీర్చన్
జాలాలగ్గులుఁ జేరు జ
గాలన్గని సాదుటరయఁ ♦ గాఁ గఱిజేజే. 35

గీ॥ ఎలరునిట్టులనా తెల్పి ♦ తెలియనట్టి
యెద్దడైనట్టి నుడులలో ♦ దిద్దునోర్చి
నన్నునాలిగ నేలరా ♦ చెన్నరాయ
నిన్నునిచ్చన నచ్చిన ♦ నెలఁతనౌను. 36

కం॥ నెఱసరి జెట్టీ నేనీ
దరిఁ జేరితి నన్ను నేలఁ ♦ దలఁచుటఁ దగదే
గరితనగు నెంతదానను
నఱయెదలేకుండ నుడుల ♦ నాలించుదగన్. 37

కం॥ అనియిటు లచ్చనచేసియు
యనినటునుడులాడి కత్తె ♦ యనుఁగుంజెలితో

నోలిమూడిననేల సోలుచు ♦ నొగ్గియేడ్చుచు నొంట నే
లీలగాలిని యుంచునో తర ♦ లించునోగదలచ్చిరా. 43

గీ॥ అరయమసుసులుఁగల్గు నం ♦ దజిలకుసుమఁ
గాఁజెలంగుదులచ్చన ♦ కన్నెనరసి
యుసుమలిడినేఁడు కడునెన ♦ మంచినేలు
సోఁకు చినుకుదారిత్రెగల ♦ సోఁకుజేజె. 44

గీ॥ కోరిరతనాని ఘుడిసన్న ♦ యూరుఁజేరె
తనరులచ్చన గొంతుకుఁ ♦ దాలిఁగట్టె
కరిచ్చరాకెనుగ్గైకొని ♦ రాగఁజూడు
తాతఁగన్నయ్య నీకిదే ♦ జోతఁజేతు. 45

కం॥ లలిసిలీలల రాచిలు
కలదణినెఱికేతిఁదేజుఁ ♦ గడునెఱిసరియుఙ్
గలిఁగెడు చక్కనినుమల
న్దైలనాడిన లచ్చితేఁడు ♦ తీరనియరితిఙ్. 46

చం॥ చిరునగుడాలు చందిరిక ♦ చెన్నెసలారుఁ దలన్జెలంగఁ జ
క్కెర సరితీయనౌనుమలఁ ♦ గేరుచునిల్లను నాకెయీమురాల్
గరుఁగునుమల్గొనాలునుడు ♦ గందగ జానుగులాలకించ ని
నిత్తఱి నెదమూలి నాయెడఁదఁ ♦ దల్లడిలన్గను సందడించెనా. 47

కం॥ కానన్నాతుక లీతల
జానుగ నాకున్ననీదు ♦ సంగాతినిఁదే

గానిడె చనుఁదెంచెద నా
చానను దేసున్నఁదాళఁ ♦ జాలనుచిలుకా. 48

ఉ॥ ఱెక్కనదొడ్డదండుఁడను ♦ తేఁకుసరాసరి నేలునేలకే.
జక్కఁగఁజేరి యందఱను ♦ సాసఁజెలంగగఁ గన్నెఁదెచ్చెదన్
నిక్కుచుగొంగతొండ్లతెగ ♦ నీల్గుచుఁగంగిస నన్నుఁదాఁకినన్
దుక్కుగఁజేసికుత్తుకలఁ ♦ మ్రించెదగాంచెద లగ్గులచ్చినిన్. 49

శా॥ సంతోసానను దొల్లిచేడె యొడలిన్ ♦ సొకెంతయోనాడ నా
యింతిన్గాడ నెడందలోనఁ గలనా ♦ యిచ్చ్వల్కడల్లాకఁ గూ
సంపైన గ్గను గూర్గరాము సకినే ♦ నాసత్తిత్తోఁదెత్తు నే
నంతన్గొంతుకుఁ దాళిఁగట్టుదుఁజుడీ ♦ యచ్చానియానా నుడుల్. 50

కం॥ ఎలనాగఁ గూడి నేనో
లలనాముచు సంతసాన ♦ లలిఁజక్కని రా
కలనాటలాడఁగలిఁగిన
యలనాఁడే లగ్గులంది ♦ హాయిగనుందున్. 51

కం॥ అనియాడి దండిదండ్ల
గ్దనరఁగఁ దనతోడఁదర్లి ♦ తడయకరానా
డినసూతుఁడు కడుతాతయ
కనుసన్నజెఱింగి చక్కఁ ♦ గానతఁడంతన్. 52

గీ॥ తెల్లతల గడ్డాలు నె ♦ ఱ్ఱినఁజెలంగ
జానుగొంతుల నీర్దారి ♦ జక్కనీటి

దారిసన జక్కి తెగఁగూర్చి ♦ కోరికలరఁ
దేరు తాయారుఁజేసి తాఁ ♦ దెచ్చెసరగ. 53

సీ॥ తెచ్చియుంచిన తేరెక్కి ♦ యిచ్చనలరి
తాతఁగన్నయ్య గూర్చుండ దారకుండు
రెండుచేతులనల్లొనే ♦ రేఖ్ఖఁజేసి
యడలుదెందాన నొగల నె ♦ న్నడిసఁజేరె 54

కం॥ కొఱడాఁగొని తెఱగంటుల
దొర తేరును సూతుఁడెటులఁ ♦ దోలునొయటులన్
నెఱిఁదోలఁ దేరుగాండ్లన్
దొరగెదురొద నెల్లకడలఁ ♦ దొందరసేయన్. 55

కం॥ తిన్నఁగఁ దనయిరుదెసలం
దన్నయుఁ దనకన్న జిన్న ♦ యతఁడున్దొగలుఁ
మెన్నఁగఁగ్రాలుచు రా నా
చెన్నరయఁగ సంకుఁజుట్టు ♦ చిలుకులనంగన్. 56

సీ॥ ఇత్తెఱంగునగొల్ల ♦ యిల్లాండ్ర తెగలకఁ
గోడెకాఁడ్రైనట్టి ♦ కోడెత్రాఁచు
పెజ్జగలట్టిఁడుఁ ♦ జెలఁగుఁ దేల్లెనుఁగుల్
గుఱ్ఱాలు లెంకలుఁ ♦ గొలుచుచుండ
హొయైనలెస్స స ♦ నాయీలనరగల
తొల్లిగాఁగలకోద ♦ లుల్లసిల్ల

లచ్చనచేసియు లగ్గానికలరత
నగుచిసన్నకోటిక ♦ కోగిఁజరాన

కానదాఁటిననేగెడు ♦ కారునందుఁ
గోరికలు క్రేళ్లు దాటఁగాఁ ♦ డేరుకుద్ది
తొందరగనట్టి నడకతోఁ ♦ దొడరు కండ
చక్కెరలదిండి యరదాని ♦ సరసఁ జేరె. 57

క౦॥ సిఁదారతెన్నలసటచేఁ
జిరచరఁగారుక్కనీటి ♦ చినుకుల తెగలన్
నెఱికసుర టీదనార్చుచు
నెఱితాతయ చేతి సురిగ ♦ నీడసఁజనుచున్. 58

సీ॥ అరదానిగాండ్లిల ♦ నంటినఁగలరోద
రహీకారునిద్దారి ♦ రంతుఁగాగ
నశికట్టుఁగట్టిన ♦ నౌరుకడాన్నేలు
తగునీటిదారి క్రొం ♦ దళుకుఁగాఁగఁ
కడుగులుగోడాడఁ ♦ జేసెడిసింగాణి
కటిజేజెయన్న సిం ♦ గాణిగాగ
డింగరిడెందానఁ ♦ జెంగటఁజనుచిల్క-
తొలినీరుదారి నె ♦ చ్చెలియగాఁగఁ

దాతకన్నయ్య యను నీరు ♦ దారిగాఁగఁ
గాంచి సిగఁ యీఁకదారుల ♦ సంచుకుంచె

లెత్తితో సానఁగన్నీరు ♦ చిత్తడీన
నాటలాడెను కానలో ♦ నీటుఁగులుక. 59

ఉ॥ చిక్కని తీఁగెటిండ్లనన ♦ చిన్కులడొక్కల నిండఁదాఁగి సొ
రెక్కిన తేఁటితెట్ట సాగ ♦ సేనెడు గాణాలసేయలచ్చి జేఁ
డొక్కటఁదాలిఁగట్టఁ జను ♦ చుండెనటంచని గాణగాఁడ్రుజాఱ్
జక్కెరగాణఁజేసిరని ♦ సారెకుఁదిగ్గనుఁ గందురెల్లరుఱ్. 60

క॥ నెగులుండని కృష్ణుఁడురాఁ
దగులగ్గులటంచుఁగ్రిక్క ♦ దండ్లనెనోనాఁ
జిగురులుఁగొరికిన నోళ్ళకు
నొగురై కోయిలలుఁగూసె ♦ నొగిసంతసిలన్. 61

చెలఁగికడు కానలచ్చి రా ♦ చిలుకనుమల
నెన్నిచేసరిగత్తి స ♦ త్తన్నుదొరకు
సిరసునందునఁ జల్లిన ♦ సేసలనఁగ
గాలిఁగదలిననలెంతొ ♦ రాలెనచట. 62

సీ॥ అందుగుచెట్లలే ♦ తాకులకొఱకునై
కైలెత్తితిరుఁగాడు గారుతెగలు
తీఁగెటిక్కలఁదర్లి ♦ రేఁగిరొదల్సేయు
చును గండులొనాలఁ ♦ దినెడు తెట్ట
దొడ్డకొండలఁగల ♦ తొఱ్ఱలలోనుండి
కడలకుఁజనెడు సిం ♦ గాలపంపు

నీలిజక్కురజాలు ♦ లీలఁజాల్గట్టి లా
గులనుండి కదలెల్లు ♦ గొడ్లకూటు

తల్లి దూఁకెడుకొండ గొ ♦ బ్బిల్లిచాళ్ళు
తొల్లిగాఁగలసంచులు ♦ నల్లనయ్య
డింగరీండ్లయి చనుఁదెంచు ♦ రంగుఁదనరఁ
గోనదారిన కదుఁగనుఁ ♦ గొనఁగనయ్య. 63

సీ॥ ఇట్లు సిరిదొరకోనలు ♦ గట్టులేర్లు
లెక్కసట్టికోటికలుఁ ♦ జక్కదాటి
కొన్నినాళ్లకు లచ్చన ♦ యన్నఁగన్న
తండ్రి మేఁలెడు నెఱిరాచ ♦ దానిఁజేరె. 64

ఉ॥ అంతటఁజెంతరాఁజిలుక ♦ హాయిగలచ్చియె దీసరుందొరా
సంతసిలంగఁజేరెతీఁక ♦ జానగులగ్గుల రాసిఁగల్గనేఁ
జెంతయొ రాచకూఁతురెద ♦ హెచ్చినకాఁకఁ దొలంగనేఁడు నీ
యంతటిజేజెఁజూడఁగనె ♦ యన్నికొఱంతలుఁ దీరకుండునే. 65

కం॥ నీనెఱి సరిసిరిసొగ
సైన గొనాలెన్నినాకు ♦ నగునేనుడి తేఁ
డైన నల దుగ్గిరాయం
డై నగ్గొనియాడఁగలరె ♦ హాళిదఁగంటిన్. 66

సీ॥ సిరియొసిరిగద్దె ♦ యిరులాడ్చుజేజె జే
జే రక్కసులదండ్లఁ ♦ జీల్చుదాయ

దాయసంద్రాని రే ♦ రాయసీకిదియె జే
జేయెన్ననౌనె నీ ♦ చేతిసత్తి
సత్తియెడందలో ♦ హత్తించుజేజె జే
జే జోగిడెందాలఁ ♦ జెలఁగునట్టి
నట్టింతలేకేన్గు ♦ నలుగూడ్చుజాణ జే
జే యీఁకదాత్రైగ ♦ రాయజక్కి
జక్కికుత్తుకతేఁడ జే ♦ జాలుకాలి
కాలిలెంకలదంట జే ♦ గాణరాణ
రాణయుదిరొల్లె దారిజే ♦ రాచకందు
కందుసత్తిఁగలాఁడ జే ♦ కట్టినేసి. 67

కం॥ అనియిటు సిరిదొరఁ జక్కెరఁ
దిను జక్కని తెక్కిదారి ♦ తిన్ననినుడుల౯
గొనియాడి చెలియకడకు
న్జని తాతయ యేగుఁదెంచు ♦ జాడనుడుంగ౯. 68

మ॥ అదితా జానుఁగులాలకించి యెదలో ♦ హాళిన్దగన్జెంది క
ట్టిదొరన్దెచ్చితి చక్కనైన నుడుల౯ ♦ తేకెత్తిఁగానాడి నా
యెదలోగాలి నిలంగజేసితిగదే ♦ యీనాఁటికోచిల్క నీ
యెదుగానేస్తిజగాన లేదనుచు నెం ♦ తెంతేని నగ్గించెద౯. 69

మ॥ అనియగ్గించుచుఁ జిల్కచేడెయెదలో ♦ నాసత్తిఁగల్గించి చ
క్కని రాకన్నియ చెంతనేకతలఁ జేఁ ♦ కాకుండ కెల్లాడితో
యననాచిల్క నుడుంగ జానుఁగులతో ♦ నాలించుచుండంగ నా
గనదండుండల లచ్చిరాయఁడట గా ♦ గన్జాడ నాలించియు౯. 70

గీ॥ తననిజోగులుఁ దనక్రిందఁ ♦ దనరు తేంట్లఁ
గోటికనేస్తులుఁ గోడుకులుఁ ♦ గొలచిరాగఁ
జేటఁగలకోడెకలు క్రిళ్ళు ♦ దాఁటుచుండ
లచ్చిదారి కెదురేగనా ♦ లగ్గులెసఁగ. 71

చం॥ చనిగనె తేఁకు సిగ్గుదరి ♦ సాలుఁగజొంటనఁ గ్రాలుసట్టి జా
ణను సుడికత్తి సంకులిరు ♦ నొరగుఁ జేతులఁ దాల్చి జేజెలన్
దనియఁగఁ జేసినేలఁగల ♦ తాతయదిట్టనుఁ దొల్లినుద్గులన్
గనఁగొనలేనిలచ్చి చెలి ♦ కానినిఁ జక్కని కోడెకానినిన్. 72

గీ॥ చూచినాఁగలి దారి తో ♦ డై చెలంగు
సిరిదారజ్జలఁ దనరెంపు ♦ చేతులాని
జోతలొనరించి నుదురంటఁ ♦ జేతులెత్తి
యుమస కన్నీరుఁగార ని ♦ ట్లనుచునుడిఁగె. 73

మ॥ సిరిరానీదగు రాకచేతఁ గడు నా ♦ చేగెంతయో రాలె జాన్
సిరులజ్జెందితి నాతిరస్తు సొరది ♦ జ్జనీస్నఁగాఁ జొచ్చె నా
నెజిసంతంతట నిండుచుండె నరెరే ♦ నేఁజేయుదోసాల చిం
దరఁగూలెన్ దొలినోఁచు నోఁతలు జరీ ♦ నజ్జెల్ల నీనాఁటికిన్. 74

గర్భకంద చంపకమాల

చం॥ సిరిదొర నీకరలొన్నరద ♦ చిచ్చరకంటియు గాలిదిండి జా
లమనుపుఁగన్నరాపరిగ ♦ లగ్గులుడింగరె దంట్లకిచ్చెదో

నెఱసరిస త్తిసోఁకు తెగ ♦ నిగ్గురగుల్లొనఁ జేయుచుండు క్రొ
న్నరితిదణేజిరానయిదె ♦ యజ్జలకేనొనరింతు జోతలున్. 75

గర్భకందం.

కం॥ దొరసీకతలొస్సరది చి
చ్చర కంటియు గాలిదిండి ♦ జాలపునుమఁగన్
సరిస త్తి సోఁకు తెగ ని
గ్గురగుల్లొనఁ జేయుచుండు ♦ క్రొన్నరితిదణే. 76

గుమసుల గీతం.

గీ॥ క్రీడిగలిఁ దీరచితిరి సిం ♦ గిణినితిగిచి
జీరకింకిరి కీరతి ♦ చీల్చితీరి
తిరినిగడీయిం జగితిసిరి ♦ దీసినింగి
యింటిగిడ్డిరిఁ దిట్టితి ♦ రీఁగిసీని. 77

## దండకము.

ఓజిడ్డసందాౘ్రనికిన్గ్లుపింగారి చన్ద్రోయిపిస్లైన జాశ్వస్తుర్తిన్గాఁకి నెన్నారుచుండష్టుజేఁడా । జగాయంటుజోళ్ళన్దఘజ్ఞాన్గుజోడా । యసల్యాలు కేల్దోయి యండెంతయోగుండ్రినేకత్తిసంకుల్గలాఁడా । నెత్తిన్నల రింజ్రైరిన రా కాసిదండ్లజ్ఞనుల్లానుతోౘ్రడా । కరా గొల్లయిల్లాండ్రకుగ్గోడెకాఁడా । చదల్ జాలు సింగాని కాటేౘ్రఁడు రేయొండరేరాయు

పొలడ్డిలితో త్తరాయంచ తాఁతాలుసోఁకొజ్జ జేజేల చెట్టేఁగి తోడ్కొన
దిండాఁరియలన్గేను తెచ్చేతినాఁ ల్గంచు లన్నిండి నిండాఁరుదిట్టా । యడప్తీ
ర్చ జేజేల కంఢైనగుట్టా । లలిన్జేజె రాఁరాల నాఁరౌన నిర్ద్గారనాఁనట్టి, న
ల్గొంటిదారీ । యొగిన్జెజెరాయగ్గి కార్దున్న రౌతల్లరాఁకాఁసిరాఁచిన్చు సం
గాఁతి గాలాఁరియ । డాఁనాఁఁడు తేఁడోఁజకాఁట్రోడు లాఁత్తెండు నిగ్గాఁకడల్
నేలు జేజేలుడెందాలలో నిన్ను రేనాఁఁడులన్నచ్చి యేనాఁఁటికెన్బిర కన్గొ
ట్టురోఁయన్నతొల్ద్దొట్టితూఁఁడ్చ్యాలి కొడ్చాలితోఁఁగూఁడి తాఁతయ్యకూఁ నాఁ
టలన్ద్రేలి కన్గూర,ఁగాఁనాఁల్లు తోఁల్లున్నప్పలన్దోఁచి సందాఁరినిలోఁడాఁఁగురా
కాఁసి జోఁరొంటిశోఁఁగల్గి నీఁడ్రేఁడులోఁఁజొచ్చి నుగ్గాఁడితౌ । జేజెలునోఁస్రఁ
కుడుల్గూఁడి సర్దాఁపుల్తైగట్టిగాఁజిడ్డు సందాఁరినిన్ద్రిచ్చ గట్టందులోఁఁగుఁరింగ
నల్దాఁసరేఁఁడొఁచు నాఁగట్టుఁఁడేలంగగాఁ నెత్తి జేజేలసింగారి యొళ్ళంతలోఁ
నాఁని చేటింతలేనట్టిడాఁ నాఁకలిన్ద్రిచ్చితౌ । నేలయంతన్రిహిన్గొంచు గాఁడ్రిం
డిరాఁ టెంకి కిన్జేనుసాఁన్నాఁని కన్రిక్క సిన్గాఁఁటి యొళ్ళాఁనికాఁర్గాలి చెట్టట్టు
లనన్గాల్చునోఁయట్ల్పులన్గాఁల్చితౌ । కల్లరేఁఁడొఁచుఁ గెంజాఁయకందోఁయుఁ
గాఁరిలంగ జేజేల సూఁఁడోఁరితాఁతయ్య యేవాఁయలన్లేఁడు లేడంచుఁఁదాఁఁగ
న్న కూఁనన్న రాఁజిగ్గిచేదూఁసి తంటాఁలుఁ జెందించ నోడ్డోఁలగాఁనింట నూఁ
ఱైన రాఁడంచు నర్సింగడన్నన్న చేఁగల్గియాఁనంజుడున్దిండిరాఁడొక్క చేగోఁళ్ల
చేఁజీల్చి చెండాఁడియాఁతొల్లి జేజేలకూఁనన్దగన్ హాళి డెందానితోఁ సాఁఁకితౌ।
నేలగుజ్జైన జేజేయితండంచు లోఁకుల్జగాలెన్నఁగాఁఁజాఁగ కాఁఁడ్రైనరాఁకాఁసి
షేఁడుక్కు చేనిక్క నొక్కజ్జచే నేలయడ్గంటఁగాఁఁదాఁరిక్కి రెండొండు లెక్కా
జగాలన్లలిన్జెజెరాఁ నేలఁగాఁఁ జేసితౌ । నేల జేజేలరాఁయొంటితోఁ రేఁఁకు కన్న
త్తి కాఁరిల్గంటకిన్గల్గి యాఁలాఁని నేలన్కనల్ గూఁడు డెందానితోఁ నవ్జనుం
డఁఁచుఁ గేతిన్గడల్ నంటు రాఁతేని రెండ్రైదునూఁళ్లొలి చేతుల్కసిన్గండ్ర

గొడ్డంటఁ దుత్తున్రలంజేసి తౌరా చసంతట్టైతోసానఁ జెందంగ చాత్తే రల్లరాతొల్లి యిల్లాలికిన్దోచి రాజోగితోలచ్చునన్గాడి యేతెంచు చున్దాట కన్ద్రించి రాకాసులన్ పుల్చి చట్రాతిసింగారిఁ గాఁజేసి కాట్రిఁడుసింగా ణిఁ జెండాడి యాసత్తితోనేలకున్గల్గునొయ్యారి కాల్ద్రొక్కి యేతెం చుచుండంగ రాగొంగయడ్డొచు రానుక్కు జక్కాడి యయ్యొద్దకేతెంచఁ గన్నయ్య నిన్నెలికజ్జేయఁగా కైకగాదన్న యానుడ్గులాలించి చాత్రేర్ల తేఁడాన తిన్రాణినిఁ లచ్చునన్గూడి కార్గొనలోఁ జేరిరాకాసిగంస్తైన దండ్ల న్న రాజీన నీల్గించి యిల్లాలు చాల్తుత్తుకల్గల్గ్రాకాసిచేఁజిక్కి. నన్నాఁ డు రాకూనతోఁగూడి జేజేలరాకూనఁ ద్రొళ్ళించి చెట్టిక్కలన్గూడి సం ద్రానినెద్దజగాదాటి చాల్తుత్తుకల్గలు రాకాసిరాతొల్లియానంజుడున్దిం డ్ల డొల్లించి యారాచదానిన్దగన్జిన్న రాకాసిరానేలఁగాఁజేసి చెట్టిక్క రాగాలి కందంగదుల్ హాళిచేఁ గొల్చుచుండంగ నిల్లాలితోఁగూడి యయ్యొద్దెకుజ్జేరియున్లచ్చి నిండారనారాచదానేలితో । యయ్య యీనేలలోనల్ల సేల్దారికిజ్జిన్న సైదోడుగాఁగల్గితో । నీగొనాల్ నెన్ని యగ్గించ నీర్చ్యాలికందుండు గట్రిని యల్లుండు జేజేలరాయండుగాల్దిం డి నాయండు లోతక్కు జేజేలు గోరంతకుఁజ్నాల రంచన్న నేనెంత నిన్నెంచ నోతాతగన్నయ్య నీయడ్గు నీర్చ్యాలిదోయిన్దలన్దాల్చి యెన్నేనియో జోతలుజ్జేసెదన్. 78

కం॥ అనికొనియాడుచుఁ జేతులుఁ
దననుదుటజ్జేర్చి తేఁడు ♦ దండాలిడి తో
డ్కొని రాగ లోకు లెల్లరుఁ
గనుచుండిరి లచ్చితేనిఁ ♦ గన్నులుఁ దనియన్. 79

ఉ॥ అక్కొటికనల్గట్టిచేలు ♦ లందఱులచ్చియె దీసరుండు నేఁ
డిక్కడి కేగుఁ డెంచెనఁట ♦ యిచ్చలుఁదీరఁగఁ గారె చూడయం
చక్కడి సజ్జలెక్క తగు ♦ నట్టుల నొక్కరితోడ నొక్కరున్
జిక్కని తేనెలూరున్నములుఁ ♦ జెచ్చెరనాడిరి సంతసిల్లుచున్. 80

మ॥ అరెరే చక్కని తేనిఁ గన్నదితఁడే ♦ నాగొల్ల యిల్లాండ్రతో
సిరికూనాటల నాడుచుండు సొగసా ♦ జేజేయితండేన సి
గ్గరియాలచ్చన చిల్కనంచియిటురా ♦ గాఁజేయనే తెంచుజాన్
గతిజేజే యితఁడేనసుగ్గఁగదె య ♦ క్కాజాన్గు లీడేరఁగన్. 81

మ॥ నెలతా గొల్లల యిండ్లజొచ్చి కడక ♦ న్నయ్యెంతయో జుట్టి నా
చెలులే తెంచినఁ జన్నులంటియద రా ♦ ల్జీఁకాకుఁగాఁ జీకుచున్
నలిరేఁగందగు నాటలాడు నితఁడే ♦ నాయత్తతోఁ గూడి స
జ్జల నాటాడెడు జాణయీతఁడెగదా ♦ చానా నెఱిన్నాడుదే. 82

మ॥ గరితాయీతఁడె జోగిజేండ్ల తెగలో ♦ గానుండురా జేఁడు సా
కిరియీతండె జగాలకెల్ల నరుడా ♦ కేత్రిసరుండీతఁడే
సారదిగ్గ్రిడికి సూఁతుడీతఁడె జగా ♦ జోకొంటితోఁ గాఱిలు జాన్
సరదారీతఁడె లచ్చిరాయఁ డితఁడే ♦ చక్కంగఁ జూడంగదే. 83

చం॥ సిరిచెలి కూనచేఁతలకుఁ ♦ జక్కితిఁదాళఁగఁ జాలనింతిరో
సరగున నీలియొంటిదొర ♦ చక్కని తేరునదూఁక చన్నులన్
గరుకున నక్కునాటనొగిఁ ♦ గౌఁగిటఁ జేరిచి యొజ్జనొచుఁ జ
క్కైర యదరాని నానిజిగి ♦ గె రెడుచెక్కులు నొక్కఁదోచనే. 84

గీ॥ చెలియ యీదార యొంటి నా ♦ చేతఁజిక్కి
తేనికొని చనిననసెజ్జ ♦ తెండఁజేసి
యట్టెఁదలకొని సిరికూన ♦ యాటలందు
సొక్కఁజేయుదు నానుడి ♦ టక్కుగాదు. 85

కం॥ కనుదోయినరుస చిత్తడి
చనులందునఁ గరుకుఁగలిఁగెఁ ♦ జనియెదిటానిక్
ననసింగాణిఁ గలానినిఁ
గనినయ్యనుఁ జూడ నీకు ♦ గతయెయ్యదియో. 86

కం॥ ఈసంకుదారిఁగన నీ
యాసలు నిండారి చక్క ♦ నయయాటలలోఁ
దోసానఁ దేలుకోరిక
లోసకి యున్నట్టునాకు ♦ నోగిఁదోచెఁగదే. 87

కం॥ ఈతనితో నాటాడిన
నాతియెతల కట్టుజండి ♦ నాతులలోనన్
యీతనితో నాటాడెడు
నాతుక తొలినోఁచునోఁత ♦ నలిఁగలవొక్కో. 83

గీ॥ కోరలదరానిఁజన్నుల ♦ క్కునను గాజు
చేతులను రెండు కెలఁకులఁ ♦ జీరలుంచి
యీతనిని నంచెదనటంచు ♦ నింతియొకతె
కన్నుఁగానక నొకచెలిఁ ♦ గౌఁగలించె. 89

క॥ అనియిటులాడుచుఁ గోర్కులుఁ
దనియన్డెందాలయందుఁ ♦ దగఁదిరిఁగియు నూ
రనఁగలచేడియ లెల్లరు
ననుఁగౌనుకులలర నిట్లు ♦ లనిరొకరొకరున్. 90

కం॥ చిగురాకుల యొఱుఁజోతి
న్నగుసిరిదొర యడుగులెజ్జ ♦ నడతగు తేజె
చ్చగుడింగరీఁడ్ల కొలలను
నెగుచీఁకటి నణఁచఁజాలు ♦ నింతిరొకంటే. 91

గీ॥ రేయిచలి రేఁగి యొద్దురా ♦ దాయరాగ
డాలుజడ నేలయనిలచ్చి నేలునితని
కాలుకేలుల కెఱఁగె నా ♦ కాలకేల
నిలచెఁజుక్కలు గోళ్ళుగా ♦ నెలతకంటె. 92

గీ॥ తాతఁగన్నయ్య తరిగట్టుఁ ♦ దాల్చితొల్లి
దాసరీఁడుగఁగల్గె ని ♦ త్రాటిని లోకు
లాగిఁగనుంగొనఁదిరిఁగి యా ♦ యొంటితోడఁ
గలిఁగెనాయనఁ దల కాళ్ళఁ ♦ గంటె చెలియ. 93

కం। జడిదొర జక్కసిరిచెలి
యొడయని చిరుతొడలసాటి ♦ నొగిరాజుట్టా
యడిదానఁ దెగియె నెదనెఱు
కుడిగిన నట్టిఁడులుఁగూల ♦ కుంపు రెసకిమూ. 94

చం॥ అరటులు నేలఁగల్గి తిరుఁ ♦ గావుటఁగానకఁ దొల్లిచూలుచే
కురకరకోఁతఁ గోఁతుకిదిఁ ♦ గూడదటంచ నటుల్కడానిసేల్
దొరతోడ దోయిమైగడఁక ♦ తోనెఱిఁగల్గిన నన్నికారులం
దరసితిరాననుండ నిల ♦ యందునగల్గెను గంటెనెచ్చెలీ. 95

కం॥ సింగానిని నెఱసున్నను
నింగిని నఱకాలఁదన్ని ♦ నెగడెడు సిరిరా
యంగముఁ గౌనెన్నదుగిన
సింగానే జాలడంట ♦ చెలిగనుఁగొంటే. 96

చం॥ సిరిదొర కౌనులాఁగసరిఁ ♦ జెందునన్దగ నేలఁజూచె నే
కరణిని నేలనంచనదొ ♦ గ్రిక్కనాడెద నాలకించుఁ దాఁ
జిఱుతతనానఁ జీరెలొగిఁ ♦ జేకొనిమెక్కిన చెట్టుసన్న డిం
గరుఁ డదిమెక్క సన్నఁజెల ♦ గన్జుడియట్టులఁ జూడనెచ్చెలీ. 97

గీ॥ రహిని లగ్గుగొనాఁను ♦ రతనరాసి
తోడఁగట్టిన నడిసజ్జ ♦ తొజ్జతెరయొ
నాగఁదోచుచునన్నది ♦ నాగుసెజ్జ
దొరకుఁగనుఁగొను నింతిరో ♦ తొందరేల. 98

చం॥ ఇలసిరిగద్దె తీఁగెకొన ♦ లెంతయుఁజేఁకటి గొంగరాగ శే
కుల నిరు నైదునూళ్లఁదగు ♦ గుట్టగఁదాలిచి నల్లసయ్యజాన్
దలసరిరాగఁ జందుఁడయి ♦ తద్దయుఁదోచిన నోడిత్రి తాఁ
దొలుతటియట్లు నీటఁజొరెఁ ♦ దొయ్యలిజూచి తెకొర్కుఁదీరఁగన్. 99

క॥ దాసానాల్కో నెత్తురలే
గాసిన్జెందించకుండు • కజీదొరగంటే
మోసకిగొల్లైతలర్చియ
న్సానులు నౌట వినరుఁ • దలచుటజుండీ. 100

చం॥ గరితరొ జూడుసోగలయి • గ్రాలుచుఁజక్కని లగ్గులచ్చనాల్
దొరలయి రొచ్చుచూలులయి • తోఁచెడుతాతయ కన్నులెంతొ డిం
గరులను నేలుసూయనుచు • గ్రిక్కునజానుని జోగులాసతో
సరిదరిఁజేరి యూషునటు • జానుఁగులంటి తిరుంగుఁదేజుతో. 101

మ॥ అలతోసానఁ జెలంగుచుండిచెలు లె • ల్లాసత్రితోఁగూడి స
జ్జల నెత్తాలననిల్చి యెన్నుచును నీ • ల్చాయన్దగున్లచ్చిరా
తలనెత్తాసఁగడింది గాలుననలు • న్దారంత దోసిళ్లతోఁ
గలుఁగున్గ్గులు నీకటంచు సరిగా • గసల్లిరెంతోలలిన్. 102

గీ॥ ఇట్టులాయూరి చేడెలుఁ • జుట్టుకత్తి
దారిఁగనుఁగొని హాయి సం • దాన్రిఁదేలి
కంటితెరఁ గొట్టకుండంగఁ • గాంచలోపు
లౌ తెలుగంటులని గొని • యూషుచుండ. 103

గీ॥ తనదు దండెల్లఁ గొలచిరా • దాతతండ్రి
దారినల తిన్నఁగాజని • తేరుడిగ్గి
రతనగుడిసన్న దొరగారి • జతనసజ్జ
నుండెఁ గషసంతసిల్లుచు • దండుతోడ. 104

ఉ॥ అన్ననునే_స్తగాండ్రి తెగ ♦ లందఱితో సికితేనిదొడ్డమై
చెన్నెసలారు నింటనిడి ♦ చెచ్చెరరాతన నట్టుఃజేరె నం
చన్నియుఁ జిల్కఁ జోగిదార ♦ హాయిగ కీ్రడియనుంగుకూన తాఁ
గన్ననిసుంగుతోఁదెలియఁ ♦ గానని హాళిని లాగరుల్గనర్. 105

## –: ఆశ్వాసాంతము :–

కుసుమ విచిత్రి వృ_త్తము॥

సురచెదు రాకా ♦ సుల నెఱిగండా
తరుఁగని కేతెం ♦ తయుఁ గలజెండా
చురుకగు రారా ♦ జుల కురిదండా
కరుదుల జాన్ద్రిం ♦ గరులకుకొండా. 106

## గద్య :

సీ॥ ఇదినాఁడుకేలు ♦ నిన్నెదలోనఁ దలఁచు డిం ♦ గరుఁడ సాదులకు
సం ♦ గాతికాఁడ । సొగసుసంతునఁగల్గి ♦ జంటితేనియలూరు
నలుఁదెఱంగులఁ గైత ♦ నాణెగాఁడ । రహిని కోరా
డక్క ♦ రానికినేత్తుండి ♦ కుడితట్టు సున్న తో ♦
ల్తుడరుకయ్య । యనునేను నారాణి ♦ కన్నన స్జి
రిన ♦ యెఱులలోకులుఁజీర ♦ నలరునతేఁడు ।
తోడుఁగలుఁగఁగ నదరాల ♦ దుగఁదగలని ।
నుడులతో నచ్చతెల్గునఁ ♦ జెడకయుండు।
కయిత నొనరించితినియట్టి♦ కతకునాల్గొ।
కతమొనర్చితి నిండుగా ♦ కట్టిజేజె. 107



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీ

# శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన లక్షణా పరిణయము.

## పంచమాశ్వాసము.

గీ॥ గొల్లయిల్లాండ్ర తెగలకుఁ ♦ గోడెకాఁడ
చక్కనయ్యకు సొగసున ♦ జతఁగలాఁడ
దండియుక్కగు నాఁగలి ♦ దారితోఁడ
జంటలేనట్టి కుంకుల ♦ కుంటతేఁడ. 1

గీ॥ తెలియనాలించుఁ జక్కెర ♦ దిండిజోగి
క్రీడిమాల్యాలితోననెఁ ♦ గేతఁదనర
నీలిదొర నొక్కయిలుఁ జేర్చె ♦ నేలదారి
కడఁకనింటికిఁజని యంత ♦ కంటెతొలుత. 2

చం॥ తలఁగక రాచకూఁతునకుఁ ♦ దాలినిఁగట్టఁగ తేఁడు తెల్లరున్
గలికితురాలుఁ దాల్చిసిరిఁ ♦ గ్రాలసుకానను దండిదండ్లతోఁ
జలుకులు సింగిణుల్గదెలుఁ ♦ జేతులఁ జేకొని గుట్టగుట్టలై
నలుదెసలందు నిండిరొక ♦ నజ్జొగినేలకుఁ జొచ్చకుండఁగన్. 3

కం॥ లగ్గానికిఁ దనయూరికి
దిగ్గునఁ జనుఁ దెంచుజేండ్ల ♦ తెగలసునెదురై

లగ్గులనారసిరాయఁడు
నిగ్గగు లోఁగిండ్లనుంచె ♦ నెఱసరియగుచున్. 4

చం॥ అరిసెలు దోసెలట్లు సుకి ♦ యల్పురలడ్డులు నేతియిడ్డెనల్
కఱుకగుగారెలున్బొలుతఁ ♦ గాగలసూడిద లోగిరాలు గ్రొ
చ్చరఁదెలెలందు నుంచి తగు ♦ సాదులతో దిగునిండ్లకంచ నా
దార తెగలారగించి రహిఁ ♦ త్రోఁగడుఁజక్కఁగనుండిరందఱున్. 5

ఉ॥ అందఱు గుట్టగుట్టలయి ♦ హాయిగ రచ్చకుఁజేరిలెస్స చె
న్నొందెడు గద్దెలందరితి ♦ నూనిదటాలునఁ గూరుచుండి రా
సందడిలోన లచ్చిదొర ♦ చాల్సరెదారియుఁ జిన్నతోడునున్
దండడి యీనఁ గొంతి చెఱు ♦ తల్లనతోఁజన రచ్చఁజేరియున్. 6

గీ॥ తగిననెఱసిరి గద్దెల ♦ సొగసుఁగులుకఁ
గూరుచుండిరి యంత నా ♦ యూరిజేఁడు
రచ్చలోనున్న రాజేంద్రు ♦ రహినిఁజూచి
చక్కనయతండ్రి యాలించ ♦ సరగననియె. 7

మ॥ కడఁకన్ నానెలలార లాగరులఁ జ ♦ క్కన్నాలకించండి నా
నుడు లీనింగిన నూఁగుచోర నెతఁజే ♦ నుగ్గాడు నాతండు రా
యఁడునాకూఁతురకంచుఁజాటితిని నా ♦ యయ్యాన్నలెన్గాంచ నా
గొడుఁగొనట్టుల సంతసింతునెదఁ జే ♦ కూడున్నడుం గోరికల్. 8

కం॥ అననాలించి యిదెంతటి
దని యెడఁదలలోనఁదలఁచి ♦ హాయిగసరదా

గ్గొనరంగఁ జోరదరికేఁ
జనుచుండిరొకొక్కరింతొ సంతోసానన్. 9

కం॥ అరాచకొమకు లంచలు
నోరజ్జనుఁ డెంచు గండు ♦ నుసులాడుచుఁ జే
కూరున్గొరికలని యెం
తొ రహ గాశించుచుండు ♦ తూలజ్జాడన్. 10

చం॥ తొలుతనె నేనుసింగిణిని ♦ తొంవరగాఁగొని చిల్కు-చేసిలన్
గలయఁగఁ దూలనేసి దొర ♦ కన్నెకుఁ దాలినిఁ గట్టుచుంచు రా
నెలలొకసారి డాసిరఁట ♦ నీల్గుచు నెచ్చటలేనిగచ్చులన్
దలఁగకనాడుచుజ్జదలు ♦ దాటెననూఁగెడుఁ దూలఁజెచ్చెరన్. 11

సీ॥ కనియెదలో నడ ♦ ల్గాంచి యీకజ్రాని
తోఁచదునాకని ♦ తొలఁగునొకఁడు
యిదిలెక్కయేయని ♦ గదిసిసింగాణిచే
నెత్తఁజాలకనేగె ♦ నింటికొకఁడు
చిలుకఁగూర్చెదనని ♦ సింగాణికినినారి
యెక్కించనేరక ♦ సొక్కొకఁడు
యిదితెర్రింతునని నారి ♦ నెక్కించియలుఁగు లె
స్సగఁగూర్చలేకట్టె ♦ జనెనొకండు

కొట్టగొరకిడి గుటిఁగాన ♦ నట్టెఁడొకఁడు
గట్టిగుటిఁ జూచి యదిదుర్రించ నట్టెఁడొకఁడు

సూటిఁదోలఁగనెయని దెస ♦ ల్జూచునొకఁడు
యెందుకరుదెంచితినియని ♦ కుందెనొకఁడు. 12

సీ॥ కంటులనుగ్గాడు ♦ కారునఁగల్గు నా
చేసత్తియేయేటఁ ♦ జేరెనొక్కొ
లెక్కలేకుండ చి ♦ టుక్కున సింగాణి
నెక్కిడుచేగెందుఁ ♦ జిక్కెనొక్కొ
రద్దినాలించి చే ♦ కొద్ది సూటిగనేయు
గుఱుతునెచ్చోటికి ♦ నరిగెనొక్కొ
చిటికెలో గొరక ల ♦ న్నిటిఁగూర్చునాచేతి
జాణతనానెందు ♦ జారెనొక్కొ
యనుచు నొక్కరితో నొక్క ♦ రాడికొనుచు
నరిదిచేఁదెరచిన గుడ్లు ♦ తెరచినట్టు
లుండియడలున సిగ్గుతో ♦ నిండి దొరలు
దిగులుఁజెందిరి లోకులు ♦ నగుచునుండ. 13

శా॥ అంతన్దాతయ యన్నచోర నిలఁ ద్రో ♦ యన్జాలి తాతయ్య యీ
యింతిన్గైకొనునంచు నెంచి తనగ ♦ ట్టెంతేనియు న్దాచెనా
చెంతన్ద్రుంచఁగఁజాలి క్రీడి కడఁక ♦ నెల్లన్దగన్గాల్చఁ డా
క్రింతన్లచ్చి దొరట్టెఁజేయుఁ గను సై ♦ గన్జేసి గూర్చుండినన్. 14

శా॥ ఆలో రాయఁడు కత్తినేస్తిఁగని య ♦ య్యా నీదుకై సత్తిచేఁ
దూలాని న్దగనేసి నాయనుఁగు కూఁ ♦ తున్గ్రాలు కాల్ద్రొక్కి చేఁ

దాలిన్గొంతుకుంగట్టు జేజతెగ దం ♦ డాలంచు నెన్నంగ న
న్నేలన్గూడంగ దేయటన్న సిరితేం ♦ డెచ్చెవతోసానితో. 15

చం॥ చిఱునగు జక్కనౌదలనం ♦ జెన్నెసలారంగ నల్లనయ్య గ్రి
చ్చర నడినన్గడాని నెఱి ♦ సాలుందటాలునం జుట్టికట్టిజా
జొరకరి నాంగలేదియంటం ♦ జూచుచునుండెడి నేలదాల్లు హా
నెఱసరిదంట యాతండన ♦ నెట్టననిల్చెను చోరచెంగటన్. 16

మ॥ కడకన్డాకయిందాల్చి సింగిణిని చ ♦ క్కన్నారి యెక్కించి దం
డడి చిల్లొకటి నారింగూర్చి కుడిచేం ♦ దాగుంజి నీరందుం జూ
డ్కడి సూటిన్దొలుగంగనీక యంట తేం ♦ డెల్లనిగుల్జెంద నూం
గెడి చోరన్దెగనేసెం దుక్కలుగం దె ♦ ల్లెత్తిన్దెసల్ నిండంగన్. 17

ఉ॥ అట్టులనింగిం జోరనొడ ♦ యల్గనుచుండంగ నొక్క చిల్లు చేం
గొట్టిన సత్తు తేనింగని ♦ కొట్టికరాయండెడందకోరికల్
నెట్టనదూకుచుండ నత ♦ నిన్గొని యూవుచనుంగుకూంతుతెన్
గట్టిగందోడితెండనుచు ♦ గాదిలిలెంకల నంచెన త్తతిన్. 18

కం॥ అంచిన లచ్చనకడ కే
తెంచి సిరిదునీండుచోరం ♦ ద్రుంచెను తల్లీ
యాచన లెంకలుం దండ్రినిం
గాంచెదనని సంతసానం ♦ గ్రాలుచు లేచెన్. 19

ఉ॥ ఆసకి జాలు కాలంగల ♦ యాతండు చోరనుద్రుంచెనంచు తె
ప్పాసగనాలకించి యెద ♦ హాళియనేకడలినడీదుచున్

నాసరిలేరటంచు నిల ♦ నౌతల చెన్నెసలార చేరలం
తేసికనుల్ సిరాజితళు ♦ కీనఁగఁ దాతయఁ జూచుకోరికన్. 20

ఉ॥ అక్కలదారిరాలు దిరి ♦ రేకులఁగూర్చిన యందలానిఁ దా
గ్రెక్కునెక్కి తోడి చెలి ♦ కత్తెలతోఁ జనుఁదెంచుచుండ నా
చక్కని కన్నెఁజేరెదొర ♦ చందురుతెల్లరు నిచ్చఁజెంది తా
రొక్కటఁగన్నులార్చకటు ♦ లోలిఁగనుంగొనఁదండ్రిచెంతకున్. 21

చం॥ అటుఁజనుదెంచు రాచ చెలి ♦ యన్గనిరా తెగ లాకెలెస్స చి
క్కటి చనులీడుఁ జక్కనగు ♦ గాదిలిలోఁతు గోనాలుజాణ తె
చ్చుట నరిదద్దిరాయనుచు ♦ సారెకు సారెకు నుగ్గడించి యా
దటనరుసానఁదేలి గన ♦ తన్దగనోండోరు లిట్టులాడిరా. 22

కం॥ ఔరా యీతలచందురుఁ
డౌరాసిసలైన నడకె ♦ లౌరా కనులం
గౌరా నెన్నొసలఖచం
దౌరానూగారునాగఁ ♦ డౌరాయెన్నన్. 23

ఉ॥ చక్కదనాలచుక్క రుసి ♦ చందులుఁగాంచినఁ గల్గుతిక్క జాన్
జిక్కనిదైయలర్చె యఱ ♦ చేతుల సాటిది డొక్కకౌను లె
స్స్కక్కుడు హత్తిగంటులకు ♦ హెగ్గడియుక్క గోనాలకెల్ల నీ
టిక్కకనంగనీగరిత ♦ కెచ్చటసాటియొకర్తురాదొకో. 24

కం॥ ఇరులాచక్కని నెఱకలు
సరులాచేదోయిచిక్కి ♦ సరులానుడుఁగుల్

దొరులానడిలాగల నె
త్తరులా గనుఁగొనఁగడొక్క ♦ తరులాచెలికిన్. 25

కం॥ ననచెండ్లు చాఁచిదుగ సు
న్ననఁదగు నడిలాగు చక్క ♦ నౌ తలసిరి యు
న్ననఁగానగు నదరాల్ జు
న్ననఁగాఁ గొంకింతలేదు ♦ హాయిగఁ జెలికిన్. 26

కం॥ నుమలకు నడలునిల్జుకలు
నడలకుఁ గడకడలకేగు ♦ నానననంచల్
యొడలికి గడగ్గడలామచు
నుమకునోస్నాన్నియింతి ♦ కొరులెటునీషా. 27

కం॥ చెలికురులొడలఁ గనులఁ జ
న్నుల నాలైదారుచాలు ♦ నూఱులనోళ్ళకన్
గలతాత దుగ్గిరాయలు
తెలుమూల్గొల్దింప్లునేర్తు ♦ రే యెన్నంగన్. 28

కం॥ ఈకన్నెల తలకట్టు
న్జకొని కౌఁగిటను జేర్చి ♦ జెలఁగునతం డీ
లోకులు నెన్నఁగ జేజే
రాకొట్టిక హాళిఁ జెంది ♦ గాౖలుటఁగాదే. 29

ఉ॥ ఎట్టులనైన నీసకియ ♦ నేర్త్రఁ గైకొనకున్న నక్కటా
గట్టితనాలనగ్గినిడి ♦ కాల్చనయంచొగి తేఁడులొండొరుల్

కట్టాకటూని యింతికినిఁ ♦ గ్రాలెడుఁ జక్కఁదనాని కెంతయో
నెట్టనఁ గోర్కెలూరఁ దగ ♦ నిల్చిరి కన్నులు నార్చకుండగన్. 30

మత్తకోకిల

చక్కనయ్యను గన్నతండ్రికి ♦ సాటిరాయలుఁజూడ తేఁ
డెక్కుడౌ యదుసాననిచ్చె గు ♦ ఱెంతొగల్గిన లచ్చనన్
జక్కనయ్యను నాదునోఁతలు ♦ సంతుసుద్దినిఁగాంచె నీ
రక్కసులగొంగల్లుఁ డౌటనె ♦ రాజులందున హెచ్చితిన్. 31

కం॥ అంచలనడకల చెలిరా
సంచరు దండంగకట్టి ♦ సంగాతఱుతన్
యించగుగందానినిఁ గలి
గించుననల్దండనునిచె ♦ నిచ్చలుఁదీరన్. 32

కం॥ సూతుం డరదానింగొని
యేతెంచినఁజూచి లచ్చి ♦ యేలికగరితన్
యాతఱిఁగొని తేరెక్కెన్
జోతినిఁగొను నీరుదాత ♦ జోడనుచుండన్. 33

ఉ॥ అంతటఁజాలుకాలఁ గలు ♦ గాయన నూఁద దెసల్గలంగ తేం
డ్లంత యెడందలందడలు ♦ నందఁగఁగల్గరి రక్కసీఁడు లిం
తంతనరాని జంకెదల ♦ యందుననాటిన సందుగొందులన్
గ్రింతలజొచ్చుచుండఁ ♦ దెఱగంటులు హాయినిఁజెందసంకునున్. 34

చం॥ సిరిదొర సంకు నూఁదఁగడు ♦ జేజెలుహోళినిఁజెంది యెన్నఁగా
గుఱిదరిలేక నల్గిత్రిగ ♦ కొట్టికలూడ్చిన కాటిఱేఁడునా
నెఱసరియై జెలంగఁదగు ♦ నీటుగసూతుఁడుఁ దేఁదోలఁ దొం
దరఁగొని దంష్ట్రలేచి తన ♦ దాఁకిన రాఁజను దెంచి చూడఁగన్. 35

ఉ॥ అన్నయుఁ జిన్నతోఁడుఁదెగ ♦ లందఱుఁదన్నొగిఁ జుట్టిరాగ నా
కొన్నిన చిల్లుదారియయ ♦ కోరికతోఁ దనయూరికేగ నా
సన్న నెఱింగి యేలికలు ♦ సత్తుమసీనుని సత్తిఁగానకన్
దున్నల యట్టులద్దగిలి ♦ దూఁరదొడంగిరి సిగ్గులేకిలన్. 36

ఉ॥ ఎక్కడిగొల్లతొత్తు కొడు ♦ కేలికలందఱ లెక్కసేయకన్
జక్కని రాచకన్నియనుఁ ♦ జయ్యనఁ జేకొని యేగుచుండె నీ
టక్కరి డొక్కజీలిచి త ♦ టాలునదంతులఁ దుక్కుఁజేసిన
ల్చక్కులనంటఁదోలి చెలి ♦ జానుగఁదెచ్చుట లెస్సయాఁగదా. 37

చం॥ అనిమిల దార్లు సింగిణుల ♦ నల్గులఁదాల్చి గుఱాలనెక్కి చ
య్యన నెఱిదండ్లతోఁగలసి ♦ యాఁతులనొక్కుచు సంకులూఁదఁగా
గనరొద నేలనింగి నడి ♦ గడ్డనిండుగ నిండుచుండఁ దా
తనుఁగను తండ్రి యేగునల ♦ దారికినడ్డుగ నిల్చిరందఱున్. 38

గీ॥ ఇట్టులిలదార్లు సంకుల ♦ నట్టె యూఁదు
చు సిరిదొరదండ్ల నిలఁజేసి ♦ చుట్టుఁజేరి
యెంతొసరదార్లు రా దొర ♦ లిందనుండ
జడియకజ్జెలిఁగొని చనఁ ♦ జను నె యనుచు. 39

ఉ॥ చిన్నెలుఁగల్గు రాదొరలు ♦ సింగిణులందున నార్లుఁ జేర్చి ర
ద్దన్నికడల్ నిగిడ్చి తగు ♦ నల్గులుఁగూర్చి కేకలేయుచున్
గ్రన్ననలచ్చి రాతెగల ♦ గాడిచన న్దగనేసి యంతనా
క్రొన్నన చిల్కుదారియయ ♦ కున్గసిఁగల్గఁగ నాడిరెల్లరున్. 40

ఉ॥ నెట్టనత్కదారియటు ♦ నీల్గుచునింగిని నూఁగు చోర రా
తోట్టినఁజూచి చిల్కుతెగఁ ♦ ద్రుంచిన యట్టులగాదు గండు రా
నిట్టిరితో నెదిర్చి యని ♦ నెట్టులఁ జేసెదు చేతఁగాదు జాన్
గుట్టుగ నింతిడించిచను ♦ కొట్టిక దారిన సిగ్గుతోడుతన్. 41

మత్తకోకిల:

చీరెలన్గొని గొల్లకన్నెల ♦ సిగ్గుఁదీసినయట్లుగా
దారయన్గసిఁదీరఁ జేడియ ♦ నట్టెఁగూల్చినయట్టుగా
దోరియన్ననుఁగూడి కోనల ♦ నోలియాడిన యాటగా
దీరసించుచు నిందరన్గల ♦ నెట్లుఁదాకుదు గొల్లఁడా. 42

చం॥ సరసకురాఁగ రోఁతయగుఁ ♦ జక్కనిసుద్దియొకింతలేదు తె
న్నెఱుఁగరు కారుకూఁతలకు ♦ నేలికలెన్నఁగ నిందరుండి యి
త్తెఱఁగునఁజూడఁ గన్నెఁగొనఁ ♦ దీరిదియెంతయుఁ గాదుకాదురా
నెఱసరి గొల్లఁడైనఁదెగి ♦ నెట్టనరాచెలి చెట్టనంటునే. 43

చం॥ కడలినిఁజొచ్చినన్దలను ♦ గట్టునుఁదాల్చిన నేలజొచ్చినన్
జడలిడుకొన్నగుజ్జు నడ ♦ సాగినఁదిన్ననిజన్నిగట్టుగా

నడచిన జోగియైతి తిఱిఁగి ♦ నన్నెఱిఁగొల్లల దుఃఖగాఁడ గాఁ
దొడరిన జాలిఁజెందకరుఁ ♦ ద్రుంతురు నివ్వడుఁ గత్తనెత్తురే. 44

గీ॥ ఓరి గొల్లడఁసాసన ♦ నూరఁదీసుఁ
దీపులందలి కడుచిచ్చు ♦ కారుకోడుల
నుదుకునకునోర్చి నీయును ♦ దుండెనేని
చానఁగొనియూరి కానాఁడు ♦ జనెదుగాని. 45

చం॥ అనుటయు లేతనౌతలన ♦ నచ్చుగఁదోఁచఁగఁ జెల్లగద్దరా
తనుసటుఁజాలనట్టె నుడు ♦ లాడిన యఁతనె గండుఁబౌదురే
తనరెడు చేతిసత్తినను ♦ దాఁకినరాజిన సుక్కుఁజేసి యీ
సునఁదెగటార్చి యీచెలిని ♦ జోకఁగొనందగు నుక్కుఁగల్గినన్. 46

చం॥ ఒడయఁడులార దొడ్డకసి ♦ నూనియొడందల గుట్టగుట్టలై
తడయకనన్నుఁగూల్చి గరి ♦ తగ్గొని యేగఁదలంచి సంతిసా
నడరుచు నేగుఁదెంచితిరిఁ ♦ కంతటనుండుడి నాదుసింగిణిన్
దడదడ నేగుఁదెంచలుఁగు ♦ దండ్లకునోర్చిన సంతసించెదన్. 47

తరల:

అనుచు లచ్చియనుఁగు సింగిణి ♦ యందునారినిఁగూర్చి లా
గినఁ దటాలునఁ గల్గురద్దికిఁ ♦ గగ్లెనేరుల రాయఁడున్
దనరుదాల్లుఁ దొలంగిరెంతయు ♦ నాఁడు రేదొర లిద్దరున్
దునిఁగి చుక్కలురాలె జల్లునఁ ♦ దూఁగెఁగొండలు దండిగా. 48

ఉ॥ అట్టుల నారిలాగి నెఱి ♦ యగ్గికణాలది సంతుఁగొట్టుకాఁ
కట్టెఁగలంగి సాఁదగు ♦ నట్టులఁదీరిన నారసాలజాల్
గుట్టలనారిఁజేర్చి దుగి ♦ నుంగనురాయఁడు నేలఱేండ్లెదల్
గట్టిగదూరి నల్లతెగఁ ♦ గారఁగనేసెఁగ డిందిసత్తితో. 49

ఉ॥ ఏసిననేలఱేండ్లదల ♦ నీసడరందఱుఁ గూడిలెస్స రా
కాసుల గొంగనెన్నెదన ♦ గట్టిగ నాటఁగనాలు గేసితే
గాసఁ దోలంగునట్టులొగి ♦ నాకొనకేసి గుఱాలసూఁతు నే
డేసిసి రాజిచిచ్చులుఁగు ♦ లేసిరిదండ్లరు దందిచూడఁగన్. 50

చం॥ అటుఁజనుఁదెంచు చిల్లుతెగ ♦ లన్నిఁటికన్ని సురగ్గినెక్కొమల్
చిటచిటలాడె డల్గులొగిఁ ♦ జెచ్చెరనేసి యడంచితిర్గి చె
న్నఁటులకు గుండెలందుదడ ♦ నాటఁగఁగూలఁగ లెస్సచిల్లులన్
దటకుననేసెఁ జక్కనయ ♦ తండ్రిగుఱెంతయుఁదొల్గకుండఁగన్. 51

కం॥ సిరిదొర సింగిణిఁ దొరఁగెడు
కఱుకలుఁగుల కోర్చలేక ♦ కడుదండులతో
దరిఁగల దళాలకురికిరి
మెరగలి సరినారసాల ♦ నేయుచుఱేండ్లన్. 52

గీ॥ కదిసి యేతెంచుఱేఁడు ల ♦ గ్గలికఁజూచి
గండుఁగొండాడఁదగిన యా ♦ దండుదొరలు
చురుకుఁగలిఁగిన కఱుకైన ♦ గొరకలూని
కలన నెదిరించి నిలచి రె ♦ క్కటిఁ జెలంగ. 53

గీ॥ గట్టిఁగ్రైకొని యిరుతెగ ♦ లట్టెఁదాఁకి
గండ్రగొడ్డండ్ల సురియల ♦ కత్తులీటె
లుక్కుగుదియల రోకండ్లఁ ♦ దుక్కు రేఁగఁ
గొట్టుకొన సాగిరెదల నే ♦ కొంకులేక. 54

కం॥ గుఱ్ఱాలనరికి యేనుఁగు
లఱ్ఱాడఁగఁ గూల్చిలెంక ♦ లడలఁగసురెచే
నఱ్ఱులఁజీలిచి తేరుల
నుఱ్ఱుగరాల్చిరి దురాన ♦ నొండొరులరిదిన్. 55

గీ॥ సూడు సరదార్లచేనని ♦ స్రుక్కుచున్న
తెగలఁగని నీలియొలెదారి ♦ తగనికినుకఁ
గలిఁగికనుదోయి కార్చిచ్చు ♦ కణుకులురల.
దెగలనిలఁజేసి యెదిరించి ♦ తెలియననియె. 56

గీ॥ ఓరి రాచెడుగెదలార ♦ నోరికోలఁది
కారుకూతఁలుఁగూసి రా ♦ కాసిసూడు
గొరకలగ్గికి నోర్చక ♦ తిరిఁగినాడు
యితరతెగలదురాన నీ ♦ ల్గించినారు. 57

చం॥ కనుకనిలోన డగ్గలిఁగి ♦ కాలికోలందిగ నుఱ్ఱులాడ సా
గిన కొరగాని యట్టెఁడుల ♦ గెల్చిన లెస్సగునానిజాన ద
క్కిన చెయిచేత రోకలినిఁ ♦ దాలిచి డాకడచేత నాఁగలిన్
దనరఁగఁదాల్చి నీలియొలె ♦ దారరుదెంచెని లుండిదిట్లులై. 58

సీ॥ అనికరాళించి గం ♦ డగు నీలియొలెదారి
రోకలిన్నాఁగలి ♦ న్జోకఁ గొనుచు
కలననొంటని యట్టిఁ ♦ డుల దండులన్జేరి
తనచేచిసత్తి యెం ♦ తయుజెలంగ
కడలిలో తరిగట్టు ♦ నడయాడునటుఁ దిరుఁ
గుచు తేండ్లలెంకల ♦ గుట్టఁజేసి
కత్తుకల్నాఁగట ♦ గుంజరోకటఁగొట్ట
నెత్తులుఁజెక్కలై ♦ జొత్తులైరి

యీసురోసాన నుడుకుచు ♦ నెంచకట్ట
కడహదను కారునాఁడు రా ♦ కొడుకులీల
గడలయందెల్లఁ దానయ్యె ♦ గ్రాలుచుండి
దండితేఁడులఁ గడకారు ♦ దారిఁదోలె. 59

కం॥ అత్తఱియెడందక నలిగు
రెత్తఁగ నల్లల్లెదారి ♦ యెగు రోకటిచే
నెత్తులుఁ జిల్లఁగఁగొట్టినఁ
దత్తరఁగొని రౌతుజక్కి ♦ దంళ్లిలఁగూలెన్. 60

సీ॥ గాలిజక్కికి సరి ♦ గానేగు గుఱ్ఱాలుఁ
జికిలించియు సురులుఁ ♦ జెడిచనంగ
దిట్టతనానెదఁ ♦ దుట్టియై చేరాయి
రాలినట్లులఁ దేరు ♦ రానడంగ

నుదిరికాడలవాలు ♦ లెమగు గొమ్ముఁగులుచిట
చిటరద్దిచేఁ దున్ని ♦ చెదరిరాల
సుడిఁగొనిసూతులుఁ ♦ గడు కేక లేయుచు
దడకొట్టి డెందాలు ♦ జడిసిచచ్చి

రెంతయో యీసురోసాన ♦ నెలరుఁగదిసి
నాగలుఁ జేమూనిచేసత్తి ♦ జిగినలాగి
నొలి గిరగిరయాడించి ♦ నేలఁగొట్టి
గీటడంచెనుఁ దాటి తె ♦ క్కొనిదారి. 61

కం॥ తొండాలనంటి యూఁచుచు
గండగు నేనుఁగులనీడ్చి ♦ కడుకటిసాల్ రా
యండల రోకటిచేఁగడి
కండలు రాలంగఁ జేసెఁ ♦ గై సిరి యడరన్. 62

ఉ॥ చిన్నయనుంగు తోడరయఁ ♦ జిచ్చుకునింగినిసుంగుతోడునై
చెన్నెసలారునట్టుఁ దన ♦ చెంత నరాఁగడు నాఁగలత్తులన్
గ్రిన్ననఁ జేర్చి రోఁకటల ♦ రడ్డులజేఁడులఁ దుక్కుతుక్కుగా
సున్నిగఁగొట్టఁగాఁ దిరిఁగి ♦ చూడకఁ గాళ్లాలదేగి రందఱున్. 63

ఉ॥ గండరగండుఁడంచుఁ దెఱ ♦ గంటులు నింగిననుండియెన్నఁగా
నండయిచిన్నతోడు సురి ♦ యన్గొని తేరుల తెట్టసూతులన్
గొండల సాటియేనుఁగుల ♦ గొట్టుగుఱాలనుఁ గాలిబెంకలన్
గండలుఁ జెండి జేజెతెగ ♦ గ్రాలెడియూరికిఁదోలెగ్రిక్కునన్. 64

మ॥ ఇటునీలోల్లెఁగలాఁడుఁజిన్నసయిదోఁ ♦ డీయిద్దరున్జేయు నె
క్కటి కయ్యానకుఁ దక్కినట్టి సిరి రా ♦ కార్రైనదండాగి చ
క్కటి యల్లుల్గొన యానఁగూర్చి నెఱపెం ♦ గానల్లుఁడు నేర్గఁ జెం
గటఁగాలూనఁగ నేకనేసిరి తెగ ♦ ల్గగ్గోలు చేఁగూలఁగన్. 65

చం॥ ఇరుతెగ లిట్టులన్గదిసి ♦ యీటెలఁ గ్రుచ్చుచు దొడ్డదుడ్లచే
సిరసులఁజిల్లఁగొట్టుచుఁ గ ♦ సిజ్జుర కత్తుల డొక్కలట్టెఁ జిం
దరఁగొని చీల్చుచున్జురుకుఁ ♦ డాఁకఁగటారులఁ గాలుసేతులున్
దఱుఁగుచు నింగిజేజెలొగిఁ ♦ దన్యఁగఁ జేసిరి కంగిసెంతయున్. 66

సీ॥ అట్టులననిఁ జేయు ♦ నత్తఱిగొరకలుఁ
దాఁకిగోడాడు స ♦ ర్దారితెగలు
నుసురులుఁజని ♦ నేలనొరిగెడు గుఱ్ఱాలు
జొత్తిలిరాలిన ♦ హత్తితెట్ట
స్సున్నైనతేరులు ♦ సోలినసూతులు
గాసిల్లిజచ్చిన ♦ కాలిలెంక
లారిసీల్గిన యొడ ♦ ళ్ళట్టెరాలినకీళ్ళుఁ
దునిఁగిన కాళ్ళుఁ జే ♦ తులునరాలుఁ

దెగినకన్నులు జాన్గులు ♦ నోగులునల్లుఁ
జినిగిరాలిన జీరాలు ♦ సేలుజోళ్ళు
గుట్టలుగనుండె నాలుక ♦ ల్గుండె లెఱచి
యడలుఁగలిగించు నట్టిదై ♦ యనికనర్చె. 67

సీ॥ తెగిరాలు గొడుఁగులు ♦ తెలిసిరి గద్దెలు
చచ్చినగుఱ్ఱాలు ♦ చాలురాసి
సన్నలుఁ దెగుతేర్లు ♦ తిన్ననిగడ్డలు
సడలినగొంతులు సంకు తెగలు
చెంగినచేతులు ♦ నింగిచూల్దింపులు
గుదెలఁ దాఁకులఁ గ్రిక్కు ♦ కూడునురుఁగు
కూలినలంకెల ♦ కూటెండ్రికాయలు
గాయాలగార్నల్ల ♦ కరుడురొచ్చు

సున్నమైనట్టి నెరకులు ♦ సొరదిచొరలు
యూఁచియిలరాలు నెఱకలు ♦ నాఁచుతెట్ట
నెట్టుకొని గారు నెత్తురు ♦ నీటిగుట్టఁ
గాగనిఁగాంచఁ గొలన జ ♦ క్కటిగనుండె. 63

కం॥ జిడ్డుకడ లల్లుఁడత్తఱి
దొడ్డగు కయ్యానచేతఁ ♦ దొడరెడిసత్తిన్
గడ్డఁగల చిలుకులేరిచి
రడ్డుల దొరలడలనేసి ♦ రంకెలుఁజేసెన్. 69

గీ॥ కలన నెదిరించు జోఁడులు ♦ కట్టిజేజె
సింగిణిని నేగుదెంచెడి ♦ చిలుకు తెగకు
నడలుడెందాలలోఁగల్గి ♦ దుడుకులుడిగి
కాలికొద్దిగనురికి చీ ♦ కాకుఁగనిరి. 70

కం॥ సిరిదొర గొరకలచిచ్చునఁ
జరచుర తెగగాలిచచ్చు ♦ సూడుల తెగలం
దరయంగ తెగకఁదక్కిన
దొరలెల్లరు నాడునట్లు ♦ తూకొని జేరన్. 71

ఉ॥ అంతటసంకునూఁది దుగి ♦ నయ్యతటాలున లచ్చనన్నె దిం
తంతనరానికోర్కెఁగొని ♦ హాయిగఁ దేరునఁ గూరుచుండి గో
రంతటిలో జరీనఁ దన ♦ హక్కుగునారికి దండిదండ్లు రా
సంతలు నిండిరాఁగ దన ♦ సజ్జకుఁ జేరె హుటాహుటిన్దగన్. 72

గీ॥ రతనగుడి సన్నకొట్టిక ♦ రాయఁడంతఁ
గంటుగండులఁ దెగటార్చి ♦ కట్టిజేజె
లచ్చన నెలంతఁగొని యూరి ♦ కిచ్చఁ జేరి
సంతసిలు నల్లునింటికి ♦ సరగనడచి. 73

చం॥ అలరుకడాని నిగ్గు జరి ♦ యంచుల చీరెలుఁ జేతికేతులున్
గలికితురాలుఁగంటెలడి ♦ గజ్జలుఁ గాసుల దండలందియల్
తళుకరదాలు గొరుతెగఁ ♦ దత్తడులున్నతి కాలిలెంకలన్
నలరుల చిల్లుదారియయ ♦ కాదటనిచ్చెఁగడింది కోరికన్. 74

శా॥ ఆయూరేలిక లచ్చిరాయనికి నో ♦ య్యన్గూఁతుకాల్దొక్కి యెం
తోయాసన్లగనాని నెల్లరుఁ గన ♦ న్దోసానఁ జేయించి జే
జేయంచున్నొగి జన్నిగట్టులనఁగా ♦ జెల్లించి కట్నాలు నా
రేయిన్గొట్టిక కేగెఁ గొర్రెలెదలో ♦ రెట్టించఁగా రాయఁడున్. 75

కం॥ అల క్రీడి కొడుకు కొడుకుకుఁ
జిలుకరు సీసరుఁడుకట్టి ♦ చెలిలచ్చన నె
చ్చెలి చెయిఁజే సంటినకతఁ
దెలియంగా నుడిఁగెఁజుండి ♦ తేనియలొలుకన్. 76

-♦ ఆశ్వాసాంతము ♦-

పంచచామర :

జకీన గొల్లకన్నెచాలు ♦ జాలుచక్కనొదరిన్
జరీజెలంగుఁ జీరెలుంచి ♦ జంటలయ్యి యాడఁగాఁ
గ రాగఁ జీరెల్లఁగొంచు ♦ గట్టిచెట్టు నెక్కి యే
చిరాకులేక నింతిజండ్ల ♦ సిగ్గుఁదీసితొదొగా. 77

గద్య :

సీ॥ ఇదినాఁడుకేలు ని ♦ న్నదలోనఁ దలఁచు డిం ♦ గరుఁడ సాదులకు
సం ♦ గాతికాఁడ । సొగసుసంతుసఁగల్గి ♦ జంటితేనియలూరు ♦
నలుఁదెఱంగులఁగ్రైత ♦ నాణెగాఁడ । రహిని కోరాడక్క ♦
రానికినేత్తుండి ♦ కుడితట్టుసున్న తో ♦ ట్రడపుకయ్య । యను
నేను నారాణి ♦ కన్నసజ్జీరిన । యటుల లోకులుఁ జీర♦
నలపునతడు । తోడుఁగలుఁగఁగ సదరాల ♦ దుగఁ ద
గలని । నుమలతో నచ్చతెల్గునఁ ♦ జెడక
యుంపు । కయితనొనరించితిని యట్టి ♦
కతకు నైదొ । కతయొసర్చిత్రి [illegible]
గా ♦ కట్టి[illegible] 78

సమాప్తము.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B108 |
| పుస్తకం పేరు | శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనలక్షణాపరిణయము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ii, iv, 6, 66, 114 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |

BLANKS - CI,BCI,166